సెప్టెంబరు, 1959

# జయంతి
# 11

సంపుటము 1 సంచిక 11

---

ఈ సంచికలో

ఆధునిక సాహిత్యగతిని సూచించే

హిందీ మాసపత్రిక :

# 'కల్పన'

నవ్య కవితా రీతులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై

విశేష చర్చలు.

కార్యాలయము :

౨౧౬, సుల్తాన్‌బజార్

హైదరాబాద్.



**PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA PRADESH.**

R. C. No. 973 M 4/58. Dated 8—6—59.

The following Telugu monthly is commended for use in all the Libraries of Schools, Colleges and public Libraries in the State.

Name: JAYANTI

K. RAGHAVA REDDY,
*For Director of Public Instruction.*



'జయంతి' రైల్వేస్టేషనులలోని 'హిగిన్‌బాథమ్స్' పుస్తకశాలలలో దొరుకును.

సూ చ న :

సెప్టెంబరు ఒకటవ తేదీ నుండి జయంతికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరములు మాత్రము జువ్వాడి గౌతమరావు, ఉస్మాన్‌పూరా, కరీంనగరము అమ చిరునామాకు పంపవలసినదని ప్రార్థించుచున్నాము. మనిఆర్డర్లు యథాప్రకారము సుల్తాన్ బజార్ కార్యాలయమునకే పంపవలసినదని ప్రార్థన

సం. జ.

# జయంతి

## 11

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.



సంపాదక కార్యాలయము
ఉస్మాన్‌పురా, కరీంనగరము

★

ప్రచురణ కార్యాలయము
516, సుల్తాన్‌బజార్.

★

మనిఆర్డర్లు ప్రచురణ కార్యాలయమునకే
పంపవలయును.

సంవత్సర చందా 8-0
విడిప్రతి 75 న. పై.

# సంపాదకీయము

ఈదేశములో సారస్వత ప్రక్రియతో సంబంధము పెట్టుకొన్న జనులను మూడువిధములుగా చెప్పవచ్చును. ఈ చెప్పుటలో ప్రధానముగా మాతృభాషయైన యాంధ్రభాషను మనస్సులో పెట్టుకొని చెప్పబడుచున్నది. భాషావేత్తలు, భావవేత్తలు, భావుకులు. భాషావేత్త లనగా నాంధ్రభాష తెలిసినవారు. ఈ తెలిసినవారిలో ననేకవిధము లుందురు. పూర్వగ్రంథముల చదువవచ్చును. శబ్దార్థములు తెలియవచ్చును. అందరికి నన్నిశబ్దములు తెలియునని చెప్పుటకు వీలులేదు. అమరమును, ఆంధ్రనిఘంటువును కంఠతః వచ్చినవారికి బహుశబ్దముల యొక్క అర్థము తెలియును. ఈ కాలమునందా సంప్రదాయము చెడిపోయినది కనుక శబ్దార్థపరిజ్ఞానము కావ్యములు చదువుటవలన కలిగినదే యగుచున్నది. అందుకనియే పలుమంది శబ్దార్థజ్ఞానము పరిచితములైన, సామాన్యములైన, పరిమితములైన శబ్దములకే సంబంధించియుంటి వారికి తెలియనిశబ్దములు ప్రయోగించినచో మారుమూల శబ్దములు ప్రయోగించుచున్నాడనియు నిఘంటువులను చూచివ్రాయుననియు వారికి తోచినట్లందురు. మనదేశములో నొక నానుడి కలదు. 'అమరము నెమరుకు వచ్చినచో కావ్యము లెందుకు కాల్పనా' అని. దీని తాత్పర్య మేమనగా కావ్యపఠనమువలన కలిగెడు శబ్దజ్ఞానము పరిమితమై యుండి, యమరము చదివినచో నది చాల పర్యాప్తముగా నుండునని ఇచ్చట నొక సందేహము కలుగవచ్చును. కావ్యపఠనమువలన నొక్క శబ్దార్థపరిజ్ఞానమేకాదు, కథ తెలియును, నానందము కలుగును, మొదలైన ప్రయోజనము లున్నవి యని. అందుకనియే తొలుత చెప్పిన మూడుతెగలవారిలో భావుకులను వేరే చెప్పినది. ఇచ్చట నాభావుకతా ప్రసక్తిలేదు. వట్టి భాషాజ్ఞాన సంబంధమైన దృష్టితో చూచియే బహుశబ్దార్థ పరిజ్ఞానము కలుగుటకు కావ్యముల కంటె నిఘంటు వుత్తమమని చెప్పబడుట. నిఘంటువులను బట్టీవేయుట కఠినమార్గమనియు నది పాతకాలపుమాట యనియు నూతను లాక్షేపింతురు గాక. విచారించదగినది నూతనమార్గమా పాతమార్గమా యనికాదు. ఏది అధిక ప్రయోజనకారి అని. అందరు నన్నికావ్యములు చదువరు. అన్నికావ్యములు చదివినను కొన్నిశబ్దములు మిగిలియే యుండవచ్చును. నేటి చదువులో నొక్కొక్క తరగతిలో పాఠ్యగ్రంథములే పాతికకు మించియున్నప్పుడు నిఘంటువు నొక్కదానిని కంఠతఃపట్టి బ్రతికియున్నన్నినాళ్ళు శబ్దార్థములకొఱకు నిఘంటు పుటలు త్రిప్పెడి బాధ తొలగించుకొనుట సుకరముగదా! కావ్యము చదువుచున్నను, తత్కావ్యములోని బహుశబ్దార్థములు వ్యాఖ్యానముచేతను, గురుముఖముగాను, తెలిసికొనవలసియే యున్నవి. ఇట్లు తెలిసికొన్న యర్థములు మాటిమాటికిని విస్మృతిపథమునందు పడును. చూచిన శబ్దమును మరల చూచుట పడును. ఇట్టి యిబ్బందులు నేటి భాషావేత్తలలో నెక్కువగా కనిపించుచున్నవి. నేటి చదువరులు నేటిలోకములోని వారేకదా! ఈ నేటిలోకముయొక్క స్వభావమేమనగా నలసత్వము, సులభసుఖసంపాదనవాంఛ. ఈ రెండు గుణములు చదువరులయందు కూడ చక్కగా నెలకొని విశిష్టములైన కావ్యములను చదువుటకు నసమర్థులను చేయుచు, అందని ద్రాక్షపండ్లు పులుపన్నట్లు సత్కావ్యములను నిందించునట్లుగూడ చేయుచున్నవి. సామాన్యముగా ఏదోషము లాధునిక ప్రౌఢకవుల యందు కలవని చెప్పుచున్నారో యాదోషములు పూర్వకావ్యములందంతటను నిండి యున్నవి. మరి కొందరు భాషావేత్తలు కావ్యములయొక్క పొంతయే పోకుండ నాంధ్రభాష తమ మాతృభాష యగుటచేత తాము భాషావేత్తల మనియే యనుకొనుచు దీనికి దోహదముగా పత్రికలు ధారాళముగా చదువుటయు, వాడుకభాషయొక్క యుద్యమమువలన నేదియైనను భాషయే యనుకొనుటయు జరుగుచున్నది. వారు కూడ ప్రౌఢకవులను విమర్శించువారేయగుచున్నారు. వారుకూడ ననుటకంటె వారే అట్టివారిలో మేటులని చెప్పవచ్చును. ఐనచో వారికి భాష రాదందురా యనగా భాష రాదనుటకాదు. భాష వచ్చుటయన్న

విషయమే బహువిధములుగా నుండును. తగినన్ని సంస్కృత శబ్దములు తెలిసియుండుట, తెలుగు శబ్దములు తెలిసియుండుట, నుడికారములు, సామెతలు, లోకోక్తులు— నివికాక సమాసముల కూర్పులోని సొగసు తెలియుట మరియు పూర్వ కవుల రచనలలోని గడుసు ప్రయోగములతో చక్కని పరిచయము కలిగియుండుట. 'నడదివ్వియలుచేసె నగరికి మాణిక్యమకుటముల్ కలిగిన మనుజపతుల' 'నడపీనుగు వచ్చెననుచు నగుదురు సుమతీ' వీనిలో నున్న 'నడ దివ్వియ, నడ పీనుగు' రెండును రూప సామ్యముగల శబ్దములే. కాని రెండవది వాడుక భాషలోనిది కావచ్చును. మొదటిది కాదు. నడబావి యన్నమాటయున్నది. శబ్దరూపసామ్య మున్నదిగాని యర్థము భేదించుచున్నది. నడపీనుగులో పీనుగు నడచుచున్నది. నడబావిలో బావి నడచుటలేదు. 'యొక్కింత వెలితి పీనుగుచేసెన్' కాళియాహిని శ్రీకృష్ణుడిట్లుచేసెనని వెన్నెలకంటి సూరన్న వ్రాసినాడు. ఇచ్చట శబ్దము అర్థముకాదు తెలిసికొనవలసినది. కవియొక్క ప్రౌఢమైన ప్రయోగములోని సొగసు. కాళియుడు పూర్తిగా పీనుగు కాలేదు. ఆ పీనుగుతనము వెలితిగా నున్నదని యర్థము. ఇట్టివి తెలిసికొనుటకూడ భాషావేత్తృత్వ లక్షణములోనే యున్నది. కనుక భాషావేత్తృత్వమనగా పరమ విశాలమైన విషయము. అది ఇంత తెలియవచ్చును మరి ఇంత తెలియవచ్చును. అంతయును తెలియుట యెప్పుడు నుండదు గాని అంతయు తెలిసినదా యన్నంత కొంత తెలిసినచో నుండును. ఆ ప్రమాణముగా తెలిసినవాడు భాషావేత్తయని చెప్పబడవచ్చును.

రెండవవారు భావవేత్తలు. ఈ భావవేత్తలు మన దేశములో క్రొత్తగా ననగా నింగ్లీషు చదువు వ్యాపించిననాటినుండి యేర్పడ్డవారు. వీరికి తెలుగు మాతృభాషయే. వారి పాండిత్యము వారికి తెలుగు మాతృభాషయగుటయు పాఠశాలలలో ఆ పుస్తకములోని పాతిక పద్యములు నీ పుస్తకములోని ఇరువది పద్యములు తరగతి తరగతియందు చదువుచు నెప్పటికప్పుడు మరచిపోవుచు పరిశిష్టమైనకొన్ని శబ్దములు జ్ఞాపకముండుట తప్పదు గనుక, అట్టి పరిజ్ఞానముతోడను నింగ్లీషులో చదివిన నవలలయు, వ్యాసములయు కవితయు వారియందు మేల్కొల్పినదియు, ఆ భాషలోని సర్వ గ్రంథములమీద నించుమించుగా విమర్శలతోసహా చదువుట యలవాటగుటచేత ఆ విమర్శలను బట్టి యేర్పాటు చేసికొనిన యూహల ప్రకారము భావ మిట్లుండవలయును అవి నిర్ణయించుకొని అట్టి భావములున్నచో నది కవిత్వమనుకొనుచు. అట్టివాడు రచయిత యనుకొనుచు నేభాషలోనైనను సరే కొన్ని భావములు సమానముగా నుండుట తప్పదు గనుక నీ సమానములైన భావములయొక్క పరిజ్ఞానముతో అసమానములైన భావములను కూడ విమర్శించుటకు పూనుకొనెడివారు భావవేత్తలు. వీరివలననే దేశములో సారస్వత ప్రక్రియయందు కొంత యలజడి కలుగుచున్నది. ఈ యలజడి రెండు విధములుగా నున్నది. ప్రతి పట్టణములో ప్రతి నగరములో విద్యావంతు లనగా నిట్టివారే కనుక వారిచేత సంఘజీవితమే ముద్రితమగుచున్నది. ఇందులో కొందరు ఇంగ్లీషుభాషలో నొక విధమైన రచయితలుగా పరిగణింపబడి వారిచేత చేయబడు నాంధ్ర భాషా విమర్శన కొక ప్రామాణ్యము వంటిది సిద్ధించి దానివలన భాషకు చాల నష్టము జరుగుచున్నది. వీరు రెండవజాతి. ఇచ్చట నొకమాట చెప్పవలయును. ఒక భాషలో పాండిత్య మనగా నది యెట్టిదైనను విమర్శవద్దకు వచ్చునప్పటికి భావుకత్వ మధికముగా గలిగిన బుద్ధికి ప్రాధాన్య వివక్ష కలుగును. ఈ భావుకత్వము తన మాతృభాషాగతములైన యుత్తమ గ్రంథములు పఠించుటచేత సహజముగా సిద్ధించినదా, విమర్శలతో సహా చదివిన ఇంగ్లీషు గ్రంథములవలన కలిగినదా? ఈ రెండవదానిచేత కలిగినబుద్ధికి భావుకత్వలక్షణము తక్కువ, ఎందుకనగా వాని భావుకత యంతయు వాడు చదివిన విమర్శ గ్రంథములలోనిది. అది

యధికముగా భావాశ్రితమై యుండును. ఆ భాషలో నున్న శబ్దముల కూర్పు దానినుండి పుట్టిన యొక విచ్ఛిత్తి విశేషము. దానిని సహజముగా తెలిసికొనుట యన్నదానికి భావుకత్వ మని పేరు పెట్టవచ్చును. ఎక్కడనో నేర్చిన విమర్శసూత్రములు మరెక్కడనో పట్టించుట ఎట్టిదనగా ఇనుము కాల్చి చల్లారుటకు నీళ్లుపోయగా చూచి ఎనుబదియేండ్ల తల్లికి జ్వరము రాగా కుండెడు నీళ్లు నెత్తిన గ్రుమ్మరించినాడట. అట్టివి. వాగర్థములు రెండును కలిసియే యుండును. ఆ రెంటిని కలసియున్నవానిని కలసియున్న లక్షణముగా చూచిన వాడు భావుకుడు. ఒకచోటి యర్థమును ఇంకొకచోటి శబ్దములో నున్నదా లేదా యని విచారించినచో నది నేటి మన సంఘలక్షణము. ఇదియంతయు స్వభ్రష్టతా లక్షణము, అని చిన్నయ్యగారు చెప్పినారు. 'స్వస్థాన వేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః'

ఈ భావుకులు చిత్రములైన వ్రాతలు వ్రాయుదురు. వారు చేతిలో నొక ఇంగ్లీషు పత్రిక యున్నచో స్వచ్ఛంద విహారమే. దేశములో నెక్కువమంది వారి జాతియే మరియు వారిత్రాత పరభాషా ప్రాంతముల యందు మరియు ప్రమాణము తెలుగులో నొకరచయిత పది నవలలు వ్రాసినాడనుకొందము. ఆతని రచనలో శైలిలేదని యీ మహాభావుకుడు వ్రాయును. ఆయన పాండిత్యమంతయు ఇంగ్లీషు చదువుగా వచ్చినది. యింగ్లీషులోననే నవలాకారుల కిది తెలియని చెప్పబడుట వినబడలేదు. కాని మననేటి ఈ ఇంగ్లీషు భాషా పాండిత్యముగల భావుకులు వ్రాయుచుందురు. వారి కాంధ్రభాషలో పాండిత్యములేదు. ఇచ్చట పాండి మనగా సహృదయత్వమని యర్థము సహృదయత్వ మనగా పూర్వప్రసిద్ధ మహాకవులరచనలు తిరిగితిరిగి చదివి పరమేశ్వరదత్తమైన యొక శక్తితోకూడి వాని నుండియతనిలో సముద్భవించిన యొక రమణీయతా పరిజ్ఞానము. వెనుకటికొక మహాకవి మరియొక కవి నాక్షేపించుచు 'మేళవించినవి సుమ్మీ దీని మెట్లని మాంసలాంసమ్మున మహతిజేర్చి' అన్న పద్యమును ఆకవి వ్రాసినచో 'ఇవి మిలనముకొనిన వెస తీగల కొదువులవి వీణ యొగువబుజమున నిడి' ఇట్లుండునని చెప్పినాడు. ఈ క్రొత్తచరణములో భావము మొదటిచరణములోనిదే. దీనిని ఇంగ్లీషుభాషలోనికి తర్జుమాచేసినచో చదివిన పరభాషారాష్ట్రాంగ్లేయ పండితులు ఆహా ఎంతబాగుగా వ్రాసినాడనుకొందురు. కాని వాడు తెలుగుభాషలో కవియేనా? ఇట్టి 'విషాదాంత'నాటకములు నేడెన్ని జరుగుచున్నవో ఆతడొక మోస్తరు భగవంతుడు వానికి తెలియును. నేటి ఈ భావుకులయందు మరియొక విచిత్రమైన లక్షణమున్నది. ఒక పద్యము చదివినచో అందులో 'మ్యూజిక్' లేదందురు. వాని యర్థము వారికే తెలియవలయును. వీరికి మ్యూజిక్, మెలడీ, మొదలైన మాటలు వచ్చును వాని స్వరూప పరిజ్ఞానమున్నదో లేదో తెలియదు. 'ఉరుదరీ కుహర సుప్తోత్థ శార్దూలముల్ ఝురవారిశోణిత శంక ద్రావ' 'సుప్తోత్థశార్దూలముల్' ఇందులో 'మెలడీ' ఉన్నదా? 'సుప్తోత్థ' ఇందులో ఉన్నదా? 'తాలుప్రవత్ఫేన జాలస్సుతో ఘోణి పంచల రొంపి కలంచియాడ' 'తాలుప్రవత్ఫేనజాలము.' ఇందులో మెలడీ ఉన్నదా? 'త్ఫే' ఇందులో మెలడీ ఉన్నదా? అవి బాబూ! యెట్లు వచ్చును? కాని ఈ చూపించిన యుదాహరణములు మాధుర్యమునకు పేరుపడ్డ కవుల గ్రంథముల లోనివి. 'త్ఫే' త్ఫేగా మధురము కాకపోవచ్చును. 'సుప్తోత్థ' సుప్తోత్థగా కాకపోవచ్చును. వారి వారి గ్రథన కౌశలశక్తిచేత వానియందు మాధుర్యము సముద్భూతమగుచున్నది. ఆ మాధుర్యము మనకు తెలియుట యెట్లనగా వారిని చదువుటయే. వట్టి చదువుటకాదు మాధుర్యమనగా నిట్లుండునని యనుకొనుచు చదువుట మానవునియొక్క సౌందర్య పరిజ్ఞానము యొక్క రహస్యమిదియే. ముక్కు సంపెంగవలెనున్నది. ఎత్తుగానున్నది. ఈలక్షణము చీనా దేశములో సౌందర్యముగాదు. పెదవులు లావుగానున్నచో మనము వెక్కిరింతుము. ఆఫ్రికాలో మెచ్చుకొందురు కనుక మానవుని సౌందర్య జ్ఞానము పరిచయాధిక్యముచేత నిత్యదృష్టవస్తువుల నుండి పుట్టుచున్నది. అందుచేత నాంధ్రభాషా మహా ప్రౌఢకావ్య రచనా పరిజ్ఞానమే యాంధ్రభాషా కవుల యొక్క గ్రంథములను చదువుటకు కావలసిన భావుకత.

చంద్రచపల యన్నదికదా! 'పాతబడ్డ వాదాల కిచ్చే సమాధానాల్లో క్రొత్తదనా న్నాశించటం కష్టం' అని (జయంతి 10 చర్చావేదిక) భాషా వాదములలో ఈ క్రొత్తపాత లేమిటి? భాష జనుల నిత్యవ్యవహారమునకు సంబంధించినది. అందుచేత మానవుని బుద్ధికి ఆలోచనాశక్తి యున్నన్నినాళ్ళు ఈ వాదములుండియే తీరును. ఆ శక్తిలేనివారెప్పుడును ఉన్నారుకాబట్టి జనుల మనస్సును పీడించు సమస్యలు పునః పునః చర్చకు వచ్చినపుడెల్ల పాతదని, అభివృద్ధి నిరోధకమని, నిశ్చయముగా అర్థనిర్ణయమునకు వీలులేని కొన్ని శబ్దములను ప్రయోగించి ఎదుటివానిని గేలి చేయుటకు ప్రయత్నింతురు.

అసలీ గ్రాంథిక వ్యావహారిక భాషల లడాయికి పేర్లు సరిగా కుదురలేదు. అప్పుడును ఇప్పుడును సంఘర్షణ జరుగుచున్నది సహజకృతక భాషలకు. వేదము వేంకటరాయశాస్త్రిగారి గ్రాంథికము వేరు. విశ్వనాథ సత్యనారాయణగారి గ్రాంథికము వేరు. గిడుగువారి వ్యావహారికము ధ్వజమెత్తినది వేదమువారి గ్రాంథికముపై. ఆ గ్రాంథికమిప్పుడు లేదు. ఆ గ్రాంథిక మెంతకృతకమో, నేటి యసంఖ్యాకములైన రచనలలో ఉపయోగింపబడుచున్న, వ్యావహారికమని చెప్పబడుచున్న భాష యంతే కృతకము. ఈ భేదము చూచుకొనునంత ఓపిక చపలురకుండదు. ఆ కృతకత్వము వేలుపెట్టి చూపించుటకు ప్రయత్నము చేయుచున్న కొందరు పాతమార్గముల కంటుకొని యున్నవారా? సత్యాసత్య విచక్షణ చేయుటకు సమర్థము కాని బుద్ధి కొత్తపాతల రొంపిలో తొందరగా దిగబడును.

వివాదాస్పదమైన విషయ మెవ్వరేది వ్రాసినను చర్చావేదికలో వేయుట జయంతి సంపాదకుల ఉద్దేశ్యమైనచో నేనేమియు చెప్పలేనుకాని సామాన్యముగా ఇటువంటి వ్యాసములు ప్రకటించుట పాఠకుల సమయమును వృథాచేయుట యనియే నా ఉద్దేశ్యము. కొండముది శ్రీరామచంద్రమూర్తిగారు బ్రాహ్మణ భాషావాదములో తగుల్కొనుట కూడ అంతే. నాకు తోచినంతవరకు ఏడవ సంచికలోని గౌతమరావుగారి వ్యాసములోని ఈ బ్రాహ్మణభాషా దాస్యమన్నమాట ఒక తృణచ్ఛన్న కూపము. మూర్తిగా రందులో నిట్టనిలువుగా దిగబడినారు. దాస్యమన్నమాటను మనసుకు పట్టించుకొనక చూచినచో ఆయన వ్రాసినదానిని నిరాకరించుటకు వీలులేదు.

ఇంతకును నాటికి నేటికి శిష్టులెవరో తేలలేదు. చదువుకొన్నవారే శిష్టులు అన్నచో వారిలో కూడ రచనావ్యవహారము వేరు, వాగ్వ్యవహారము వేరుగానున్నది. వాగ్వ్యవహారమునకు నియమము లేదు. అది ప్రమాణముగా గైకొన్నచో నియమరాహిత్యము పెంపొందించినవార మగుదుము. మరి వాగ్వ్యవహారమునకు రచనాభాషకు సంబంధము లేదా యన్నచో ఉన్నది. ఉండుటేకాదు ఆ వ్యవహారమే ఈ భాషకు ఆధారము, ప్రాణము. ఈ ప్రాణమైనది ఒక శిష్టజనవ్యవహారమే కాదు. సర్వజన వ్యవహారము. కాని యా జనవ్యవహారము పొలములో పండిన ధాన్యమువంటిది. దానిని దంపవలయును. ఉముక బియ్యము తవుడు దేనికది వేరువేరు చేయవలయును. అప్పుడుకాని ఆ వస్తువు భోగ్యముకాదు. కాదు మేమావడ్లు ఉన్నవున్నట్లుగానే మెక్కెదమన్నచో ఆ పని చేయదగిన ప్రాణులు వేరే యున్నవి. ఈ విషయ మటు గౌతమరావుగారు, ఇటు చపలాదులు అందరును మరచిపోయినట్లున్నారు

సరే. కొంతవరకొప్పుకొందము. వీరు కేవలము పాతమార్గమున కంటిపెట్టుకొని యున్నవారని. అయినను ఆ మార్గము యొక్క మంచిచెడ్డలు కొత్తతలపా కంటుకొని లేవుకదా! విషయము యొక్క మంచిచెడ్డలను వదలిన ఈ కొత్తపాతల సంఘర్షణ దేశమునకు చెప్పరానంత నష్టము చేయుచున్నది. ఒక విశృంఖల ప్రేమవాదము బయలుదేరినదనుకొందము. కాలవైపరీత్యమువలన

దానికి బలముచేకూరినది. అప్పటికిని నిలువద్రొక్కు కొనగలిగిన కొందరు పతివ్రతలున్నచో, ఆ సనాతని నేనీ దేశములో చావనేచావనన్న మహాభిమానమును, గుండెదిటవును గలది యైనచో, ఇది పాత కాలపు మనిసి యని ఈసడించుకొనువారి బుద్ధి వైభవమును గూర్చి యేమని చెప్పవలయును? అనాలోచితమైన ఈ తేలికమాట ఎంత నష్టము చేయుచున్నదో ఉపయోగించువానికి తెలియునే తెలియదు. ఆ మాట యతడు దుర్బుద్ధితో కూడ ఉపయోగించుటలేదు. సంఘమునందధికసంఖ్యాకులు వట్టి వేళాజీవులు. ఆ వేళయందా సిద్ధాంతమునకు ప్రాబల్యము. వారు దానివెంట బడిపోదురు. గతకాలపు తెరలను తొలగించి వెనుకకు చూడగల శక్తి కాని, భవిష్యత్తును చీల్చుకొని ముందుకు చూడగల శక్తి కాని వారికుండవు. సిద్ధాంతము యొక్క సత్యత్వమునందు నిష్ఠకలవారు మాత్రమే భూతభవిష్యత్తులను చీల్చుకొని చూచుటకు ప్రయత్నము చేయుదురు. ఈ వేళా జీవులచేత అట్టివారు పీడింపబడుదురు. పీడయన్న దొక్క యార్థిక రాజకీయ రంగములందే లేదు. సర్వత్ర నున్నది. నాలుకనుండి సర్వవేళల పరభాషా విషము గ్రక్కుచున్న ద్విజిహ్వులు, స్వస్థానవేషమును వదలి ఎక్కడనో యెవరో ధరించు వేసములు నడివేసగిలో కూడ పైనుండి క్రిందికి చెమటకార్చుచు ధరించి దేశముయొక్క వాతావరణమును తిట్టిపోయు విపరీత బుద్ధులు, అధికారులై అధికసంఖ్యాకులను పీడించుచున్నట్లు, సాహిత్యములో కూడ ఏ విషయము సమగ్రముగా తెలియని, కవిత్వ మనగా గాలిలో క్రిములు పుట్టినట్లు తనంతతాను పుట్టుకొని వచ్చుననుకొనెడి స్వయంభువులు, శాస్త్రాధ్యయనములో జీవితమంతయు ధారవోసిన మహాపండితులను, కవిత్వమును దీక్షగా తదేకనిష్ఠగా కొనసాగించెడి మహాకవులను, అలసత్వమువలన తమ చుట్టు చేరెడి వేళాజీవుల సంఖ్యాబలముచేత పీడించుచున్నారు. పాతవారు, ఛాందసులు, సనాతనులు ఈ మాటలు వీరి ఆయుధములు. ఈ ఆయుధప్రయోగములో యుక్తాయుక్తవివేచనములేదు. ఆ మాటల యర్థముకూడ వారికి సరిగా తెలియునో తెలియదో సందేహమే. సాహిత్యములో ఈ పరపీడన యంతరింపవలయు నన్నచో సాహిత్య చర్చలలో ఈ మాట లుపయోగింపకూడదు.

రమణారెడ్డిగారి విక్రాంతి (జయంతి 10) కొట్టవచ్చినట్లున్నది. భావానుగుణమైన లయగలిగిన ఛందస్సు నేరుకొనుటలో కవియొక్క ప్రతిభ గోచరించుచున్నది. అక్కడక్కడ కిన్నెరసాని నడకలోని నిండుదనమును కొంతకొంతగా సంతరించుకొనుటకు ప్రయత్నముచేసిన ఈగేయము సైన్యము యొక్క తొందరనడలను, పరాక్రమమును, వ్యాపించుటలను లయచేత, నడకచేత, ఉపయోగింపబడిన శబ్దసామగ్రిచేత చక్కగా చెప్పగలిగినది. ఈవిద్యను వారు నిరంతరనిష్ఠగా సాధించినచో తెలుగు దేశములోని గేయకవులలో (వీరు పద్యములు వ్రాయుదురో లేదో నాకు తెలియదు కనుక) అగ్రగణ్యులు కావచ్చును. ఈనాడు గేయకవులుగా ప్రసిద్ధిజెందుచున్న వారికి గేయముల నడకనుగురించి ఈకవికున్న ఔచిత్యజ్ఞానము ఉన్నట్లు లేదు.

మిరియాల రామకృష్ణగారి ముక్తిలో ప్రత్యేకత యేమియులేదు. వారిదివరకు వ్రాసిన ఆశ చాలమెలుగు. జయంతి సంపాదకులు పాఠకులను మభ్యపెట్టుట కొంత నేర్చుకొనుచున్నారు. కొన్ని మంచి రచనలతోపాటు కొన్ని మంచివియు చెడ్డవియు కాని రచనలను ప్రకటింతురు అవి బాగున్నవన్నచో నున్నవి. లేవన్నచో లేవు. ముక్తి అటువంటిది.

చివికిపోయి యదాయదలైన హృదయము పుత్రునియందు వహించిన మమకారము, ఆపుత్రుని మంచిచెడ్డలెరుగని యౌవనోద్రేకము, 'మమకారము' (జయంతి. 10. మధురాంతకం రాజారాం) లోని ఇతివృత్తము. తెలుగుకథకు లనేకు

లలో లేని మంచిలక్షణము రాజారాంగారిలో ఒకటి ఉన్నది. భాషనుగురించి శ్రద్ధవహించుట.

చక్రవర్తి రంగస్వామిగారికథ (బ్రతుకునీడ జయంతి. 10) వైఫల్యమునందుకూడ తృప్తివహించిన ఒక సంఘసేవకుని గురించి చెప్పబూనినది. కొన్ని గొప్పలక్షణములుగల మానవులను మురికి కాలువలమధ్య గుడిసెలలోతప్ప ఇంకొకచోట చిత్రించలేని మనః ప్రవృత్తి తెలుగు కథకులలో విశేషముగా నున్నది.

కొందరికి తెలుగులో నాటకములేదు. మరి కొందరికి తెలుగులో నవలలేదు. ఇంక కొందరికి తెలుగులో కావ్యములేదు. సున్నకుసున్న హళ్లికి హళ్ళి. ఈ గాలిమాటల కేమిగాని తెలుగులో నిజముగా గొప్పనాటక మొకడున్నది. దానిపేరు ప్రతాపరుద్రీయము. చిక్కేక్కడ నున్నదనగా ఈ నాటకమును వ్రాసినవారు 'ఛాందసు'లైన వేదము వేంకటరాయశాస్త్రిగారు. మరొక చిక్కేక్కడ నున్నదనగా నాటకేతివృత్తము సంఘసంస్కారాభిప్రాయములకు దోహద మొనర్చునది గాదు. అందుచేత తెలుగులో ఏకైక నాటకమున్నచో అది 'కన్యాశుల్క' మగునుగాని 'ప్రతాపరుద్రీయము' కాదు. గాఢప్రతిభకు అల్పప్రతిభకు భేదమెరుగని వారి అభిప్రాయములతో మనకు తగాదా యెందుకుగాని ఇంత గొప్పనాటకమును గూర్చి ఎంత చెప్పవలయునో అంత చెప్పబడలేదు. అమరేశం రాజేశ్వరశర్మగారు స్రవంతి జులై ఆగస్టు సంచికలలో వేదమువారి రూపకములను గురించి వ్రాయుచు ఈనాటకమును గురించి కొంత వ్రాసినారు. 'ఆయనగాలిని జేనును, తోయముతోనరకు, పొగలతో గోడలిడున్.' ఈరెండు వాక్యములు యుగంధరుని సర్వసామర్థ్యమును మూటగట్టి యందిచ్చుచున్నవి. నాటకములో పద్యమక్కరలేదనగా అవునులేదని తలలూపువారే కనబడుచున్నారుగాని సరిగా వాడుకొనగలిగిన వారి చేతిలో అది బ్రహ్మాస్త్రమని తెలిసినవా రరుదు.

ఆ రెండువాక్యము లట్లే ఆ పద్యములో చెప్పినప్పుడు మాత్రమే ప్రేక్షకు లెక్కడివారక్కడ విహ్వలించిపోవుదురు. లక్షవిధములుగా చెప్పి చూడుడు. ఆ శక్తి రానేరాదు. పద్యరచనలోని విరుపులకు, శ్రోత వానియందువహించు ఆభిముఖ్య వైముఖ్యములు ఊహించగలిగినవాడే ఈ పద్యము వ్రాయగలడు. ఆ నాటకములోని వెఱ్ఱివాని పాటలు. ఇంకొకడు వ్రాయలేడు. శాస్త్రిగారు పరమకృతకమైన గ్రాంథిక వచనము వ్రాసిన వ్రాసిరిగాక. తెలుగులో గొప్పనాటకమును మొదటిసారిగా నిర్మించిన కీర్తి ఆయనకే దక్కును. ఆ కీర్తి త్రికాలాబాధ్యము.

దుర్బోధముగా నుండుట కవిత్వమైనచో దుర్గానంద్‌గారు స్రవంతి ఆగస్టు సంచికలో వ్రాసినది (భాభారూపము మారుట) కవిత్వము కావచ్చును. కొన్నిమాటలు వా రేయర్థములో వాడినారో అధస్సూచికలుగా వ్రాసినచో బాగుగా నుండెడిది. 'జడత్వమూ, మానవుడూ, వ్యాపారి - ఇదీ జీవి మార్పు' అనగా ? ఇటువంటివే మరికొన్ని.

ఇదికాక స్రవంతిలో మరి నాలుగు కవితాశీర్షిక లున్నవి. 'ప్రభు' వ్రాసిన "భారతీరాలు' ప్రాథమికులు అభ్యాసముకొరకై వ్రాసుకొన్నట్లున్నది. స్రవంతి సంపాదకులలో నొకరు యువకవులలో నగ్రగణ్యులు, వారు కొంతశ్రద్ధ వహించవలసినదని మనవి.

క్షేమేంద్ర మంచి యూహాశాలురైన విమర్శకులు. కాని తొందరలో వారు కొన్ని అతిశయోక్తులు పలుకుదురు. 'ఇన్నివందల పద్యము లింత ధారాళముగా వ్రాయు శక్తి కలిగిన తెనుగు కవు లీనాడు ఇద్దరు ముగ్గురకంటె నెక్కువలేరు. (స్రవంతి పుస్తకసమీక్ష). కాదు. చాలమంది యున్నారు. కావ్యరచనను గూర్చిన ఇతర విషయములు తెలిసినవారు అంతకంటె నెక్కువ లేరుగాని వట్టి పద్యరచనా సామర్థ్యమును గురించి ఆ మాట చెప్పుట భరింపరాని అతిశయోక్తి. ఇటువంటి

వాక్యములు కొంచెము జాగ్రత్తగా వ్రాయవలెను. కనీసము మనమిప్పుడు వ్రాయుచున్న వాక్యమున కింకొకప్పుడు మనము వ్రాసిన వాక్యముచేతనే వ్యాఘాతము కలుగకుండ నుండవలెను గదా!

ఆంధ్రసచిత్ర వారపత్రికలోని యక్షరములు ముద్రారాక్షసుని వివిధాయుధ హతిచేత, ముక్కు మొగము జెక్కబడిన పురాతన దేవాలయ విగ్రహములవలె నుండుట పరిపాటియైనది. సుప్రతిష్ఠితములైన పత్రికల గతియే తెలుగుదేశములో నిట్లుండ దుర్బలుల సంగతి చెప్పుట యెందులకు? దీనికి కారణము కేవల మశ్రద్ధ. అనగా పాఠకుల యందు నిరాదరణ. సంపాదకులచేత, పత్రికావ్యవస్థాపకులచేత తెలుగు పాఠకలోక మెంతగా వంచింపపడుచున్నదో దానికి సృష్టిలో ప్రతిలేదనుకొనవచ్చును. లేనిచో తెలుగు కథలనిండ ఇంగ్లీషు శబ్దము లెందుకు? *'పంక్చువాలిటీ'* *'ట్రూకాపీలు'* *'సర్టిఫై చేయాలి'* *'లాస్ట్ డేట్'* *'ఒరిజినల్స్'* *'స్టూడెంటు'* *'ప్లేగ్రౌండ్'* *'అఫీషియల్ గొంతు'* *'ఐకాంట్ డూ ఇట్ నౌ, గో అండ్ మీట్ సంబడీ'* *'విష్ యూ గుడ్ లక్'* (ఆంధ్రపత్రిక. 22-7-59 నేనూ ఒక మనిషినా?) *'క్లోజ్'* *'రూమ్'* *'రిజర్వ్డు'* (అదేసంచికలో) *'ఆల్ ఆర్ సేఫ్ హియర్, అండ్ హోప్ ది సేమ్ విత్ యూ.'* *'మచ్ యాడో ఎబౌట్ నథింగ్'* ఆ (12-8-59. అల్లుని ఆగమనం,) పై కథలోని మరొకశబ్దము చూచినారా? 'సాలిలక్వీ' ఇటువంటివి కొల్లలు కొల్లలుగా చూపించవచ్చును. ఇందులో తెలుగుభాషలో జీర్ణించుకొని పోయి నిత్య వ్యవహారములో చేరిన వెన్ని? అక్కడ ఆ ఇంగ్లీషు శబ్దము వాడుట తప్ప గత్యంతరములేని స్థానములెన్ని? ఆ యా రచయితలు సెలవిచ్చెదరా? సంపాదక మహాశయులు విశదీకరింతురా? తమ చేతిలో నున్న సామగ్రిని సంపాదకులు ప్రచురణకు ముందు చదువరేమో యన్న సందేహము తీరుటలేదు. లేనిచో 'సాలిలక్వీ' (ఉచ్చారణతప్పు) ని కూడ తెలుగులో చేర్చు 'క్విక్సాటు'లు తెలుగు రచయితలలో నుండగా వారికి తగిన 'సాంకో పాంజా'లుగా మన సం'ఘాతకులు' తయారగుదురా?

మరి మీకు 'నాగరకత' 'నిరాడంబరత' యన్న శబ్దముల కర్థము తెలియునా? మొదటి శబ్దమునకు 'అర్బానిటీ' యని, రెండవశబ్దమునకు 'సింప్లిసిటీ' యని సాళ్వ కృష్ణమూర్తిగా రర్థములు వ్రాసినారు రోమన్ లిపిలో. భారతి సంపాదకులు ప్రకటించినారు. (రాళ్ళపల్లివారి వచన రచన.. ఆగస్టు) మరి రాయల గయశాసనము జయశాసనమా? అని తెలిసికొను కోర్కె మీకున్నదా? మొదట ఇంగ్లీషు భాష చక్కగా నేర్చుకొనిరండు. ఆభాష మీకు రాదా? ఈ దేశములో ఉండు అధికారము మీకు లేదు. స్వతంత్ర భారత ప్రభుత్వ మట్లనుచున్నది. ఆ దేశములోని తెలుగు రచయితలు కూడ అట్లేయనుచున్నారు. ఇంగ్లీషు వాక్యములు యథాతథముగా ఉద్ధరించుట యట్లుంచి వారు కనీసము వానికి తెలుగు వివరణమైన వ్రాసిన పాపాన బోవుటలేదు. (భారతి ఆగస్టు. పుటలు 15-16)

ఒకే వాతావరణము చుట్టు తిరుగుచున్న కథలతో మొగము మొత్తిన పాఠకులయందు సానుభూతిగా రెండుకథలు ఆంధ్రసచిత్రవారపత్రికలలో వచ్చినవి. ఒకటి 'మానవుడి విజయం' (మధురాంతకం రాజారాం 5-8-59) రెండు 'నల్లతోలు' (సి. రామచంద్రరావు. 12-8-59)

కథారచనలో కథాంతమునకు మిక్కిలి ప్రాముఖ్యమున్నది. ఏ ప్రయోజనమునకై కథ చెప్పబడినదో, అది సిద్ధించిన తరువాత కథ పొడిగింపబడకూడదు. ఆ దోషమునకు పాల్పడిన కథ సులోచనారాణిగారి 'పెళ్ళిప్రయాణం' (ఆంధ్రపత్రిక 5-8-59) పరస్పరము ప్రేమించుకొన్నవారు పెండ్లాడిన తరువాత పడకగదిలో ఎవరు మొదట పలుకరించి రన్నది మా పాఠకుల కన

వసరము. ఎవరు మొదట పలుకరించినను 'చివరి దైనఫలము' మాకు తెలియును. 'మంజీర' గారి స్వరజతి' (భారతి ఆగస్టు) లో కూడ చివరి పేరా యనవసరము. ఆ కథలో భార్యచేసిన దొంగతనము ప్రధానముకాని బండి కుదుపులో యామె శరీరము నొరసుకొని భర్త సుఖానుభూతి నొందుట ప్రధానము కాదు.

విశ్వనాథసత్యనారాయణగారు 'అంతఃకరణ లోకము లేలిన మహాప్రభు' వైన కాళిదాసుని శిల్పవ్యాఖ్యానముతో జయంతిని, తన లోతులెరుగరాని జీవశిలమైన వేదనయొక్క అనంతముఖ ప్రవాహములలోని యొక ప్రవాహమైన శ్రీగిరి మధ్యాక్కలలతో భారతిని అలంకరించుచున్నారు. శబ్దార్థముల సుస్థుజ్ఞానము చరమదశ నందుకొన్న చోటినుండి వారి విమర్శ ప్రారంభించును. వారి కవిత్వమునకు తుది మొదళ్ళవి యని యేర్పరించుట కష్టము. యస్వీ జోగారావుగారు వారి మేనకా విశ్వామిత్రమును గురించి భారతిలో కొంత వ్రాసినారు. అందులో "విశ్వనాథవారు దీనిని విశ్వామిత్రుని కథ యనుటకంటె మేనక కథ యనుట కెక్కువ మోజు పడుదురు" అని యభిప్రాయపడినారు. ఆ యభిప్రాయమునకు ఆధారము కథాప్రధానశ్రోత యయిన రాముడు "అన్ని యంశమ్ములును జెప్పి నట్టి తీరు వేఱు; మేనక కథ తీరు వేఱుగాదె" అని లక్ష్మణునితో అన్న మాటలు.

విశ్వామిత్రుని కథ చెప్పినది శతానందుడు. కథ మొదలు పెట్టుచునే "ఈయన కథ చెప్పెద విను, మీయన తొలినాళ్ళు రాజ్యమేలెను" అని మొదలు పెట్టెను. కథాంతమున "నాయనా! రామచంద్ర! మందస్మితాస్య! గాధిజుడు బ్రహ్మఋషి యైన *కథయు నిదియ...*" అని విరమించెను. అందుచేత అది విశ్వామిత్రుని కథ యనియే కవి నొక్కి చెప్పెను. మరి మేనక కథ తీరు వేరు అని చెప్పుట యేమి? ఈ మేనక కథ విశ్వామిత్రుని కథలో యేకదేశము. కాని ఈ కథ మూలమునందుకన్న విస్తరించి చెప్పబడినది. రామునిచే ప్రత్యేకముగా పేర్కొనబడినది. కారణ మేమనగా శ్రోతలైన రామలక్ష్మణుల యెదలు అప్పుడప్పుడే మన్మథునిచేత స్పృశింపబడుచున్నవి. మేనకా విశ్వామిత్రములోని ఆ మాన్మథభావము వారిని బట్టుకొన్నంతగా ఇతరాంశములు పట్టుకొనలేదు చెప్పుచున్న శతానందుడు గూడ కథామధ్యములో "శ్రీసతి ఫుల్లగల్లపరిచిహ్నిత కుంకుమ పత్రభంగ విన్యాసిత రమ్యవక్షు" అని శ్రీరాముని సంబోధించినాడు. ఇటువంటి సంబోధన ఒక్క మేనక కథలోనే యున్నది. అంతకుముందు 'సర్వకార్ముక విద్యా ప్రశస్తహస్త! ఇనవంశ తుషారదీధితీ!' మొదలైన సంబోధనలే చేసినాడు గాని శృంగార స్పర్శ కలిగిన సంబోధన చేయలేదు. రాముని వయోఽవస్థ ఈ కథను అతని మనస్సునందు ముద్రితము చేసినది. కాబట్టియే ఆ మాటలు లక్ష్మణునితో 'ఏకాంతము' లో ననినాడు. ఆ ముద్ర యెంతటి దనగా విశ్వామిత్రుని క్రియలను కొన్నింటిని తరువాత సీతాదేవిపై ప్రయోగించినాడు. ఒక విధముగా రామచంద్రునిలోని మన్మథ భావమునకు ప్రబోధము ఈ మేనక కథతో కలిగిన దనవచ్చును.

మరియు కామమును జయించుట జితేంద్రియత్వమునకు ప్రథమ సోపానము. మేనకా ముఖముగా విశ్వామిత్రుడా మెట్టెక్కినాడు. అందుచేత ఆ కథా విస్తార, మా ప్రాముఖ్యము, కథాగతౌచిత్యమును బట్టి, కవికున్న 'మోజు'ను బట్టి కాని, అభినివేశమును బట్టికాని కాదు. ఏమియు లేదు కాని దేనికెంత వెల యుండవలయునో అంత కాక ఎక్కువ తక్కువలుగా వెలకట్టిన కావ్య రచయిత దోషి యగును. "బహుధా రూపిత సూక్ష్మతర కథాంశు" లట్లు చేయరు. మూలమును వదలి చూచినచో కల్పవృక్షములోని విశ్వామిత్రుని

కథలో అన్నిటికన్న విస్తృతి నందినది వశిష్ఠ విశ్వామిత్ర యుద్ధము. అది యీ సర్వకథకు మూలము. బీజ మక్కడ పడినది. ఒక కథను విస్తరించుట ఇంకొకదానిని కుదించుట మహాకవి తెలిసిచేసే చేయును. వ్యక్తిగతమైన 'మోజుల' ప్రసక్తి యచ్చట లేదు.

కొందరు ప్రసిద్ధులతో తప్పనిసరిగా వ్యాసములు వ్రాయించుట భారతివారు పనిగా పెట్టుకొన్నట్లున్నారు. ఆరుద్ర వ్యాసమా పనికి ఫలితముగా వచ్చినదే యన్నట్లున్నది. శ్రీపాద వారిదికూడ.

అంత్యప్రాసల 'సర్ప పరిష్వంగము' లో పాపము! నారాయణరెడ్డిగారి భావముల కురివడినది. (విచిత్రమేళనము-భారతి)

"చేదులోన స్వాదుతా విచిత్రరుచి ప్రేరణమ్ము
అవ్యక్తములోన వ్యక్తతా వ్యథా ప్రతారణము"

నిజముగా శబ్దముల యొక్క విచిత్ర మేళనము జరిగినది! అర్థము మాట దేవుడెరుగు. శబ్దము మీద మాకు మమకార మున్నది. అది మాత్రము తక్కువా?

కఠినోపనిషత్ (దేవరకొండ బాలగంగాధర తిలక్-భారతి) సర్వమును క్రొత్తగా నున్నది. బుఱ్ఱ నున్నగా గొరిగించుకొని చంకలో పిలక పెంచుకొనుట కూడ క్రొత్తగా నుండును. క్రొత్తది గనుక ఆంగ్ల శబ్దములు లేకుండ ఈ రచన యుండజాలదు. అవునుగాని అడుగుట మఱచిపోయినాను. తెలుగులో ఆంగ్లశబ్దము లింత నిరాటంకముగా వాడుటకు మార్గదర్శియైన 'వాల్మీకి' యెవ్వరో!

## ఆకాశవాణి :

ఏదిఏమైనా ఒక సంప్రదాయానికి సంబంధించిన రచన చేస్తున్నప్పుడు ఆ సంప్రదాయానికి ఆరచన అనుగుణంగా ఉండేట్టుగా చూడవలసిన బాధ్యత రచయితది. రచయిత దాన్ని వదలినా. ఆరచనను ప్రసారంచేసే ఆకాశవాణి వారైనా దాన్నిచూడ వలసి వుంటుంది. అయితే రచయితా, ప్రసారకులున్నూ, ఆబాధ్యత విస్మరించడంవల్ల ఈమధ్య జరిగిన ఆకాశవాణి 'సంగీత నాటకసప్తాహ' సందర్భంలో 21-7-59న శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'ఆండాళ్' నాటిక శ్రోతలు వినవలసి వచ్చింది.

ఆండాళ్ (గోదాదేవి) యొక్క కథ గురుపరంపరాప్రభావం, ఆచార్యసూక్తి ముక్తావళి, ఆముక్తమాల్యద మొదలైన గ్రంథాల్లోఉంది. శ్రీ శాస్త్రి వీటన్నిటిని వదిలి కథానిర్మాణం చేశారు. ముఖ్యంగా కథానిర్మాణంలో కొట్టవచ్చేట్టు కనిపించేలోపం. ఆండాళ్ లభించినతరువాత విష్ణుచిత్తుడు పాండ్యసభలో శాస్త్రార్థానికి వెళ్ళటం. దీనికిమూలం ఏగ్రంథంలోనూ లేదు. పైగా ఈ మార్పు కథకుతెచ్చిన దోహదం ఏమైనా ఉందా అంటే అదీలేదు. పై పెచ్చు ప్రధానమైన ఆండాళ్ కథ, అప్రధానమైన విష్ణుచిత్తునికథ పెరగడంతో దెబ్బతింటున్నది. నాటికను ఒకగంటకు పెంచడం అనేఆశయం ఉండడంకన్న, ఆ పెంపుదల. సరిగ్గా ఉందా? లేదా? అనేఆలోచన ఉండుట అవసరం గదా. ఇంత పెంచి, ఆండాల్ కథలో ముఖ్యమైన కాత్యాయనీ వ్రతానుకరణం, ఆసందర్భంలో ఆమెరచించిన 'తిరుప్పావు' ప్రబంధస్మృతీ లేనే లేవు......తరువాత కనుపించేది కాలానికి సంబంధించినలోపం. విష్ణుచిత్తునికి చాలాకాలం తరువాతి వారయిన శ్రీ పరాశరభట్టరు రచించిన 'రంగనాథస్తోత్రం'లోని కస్తూరికలితోర్ధ్వపుండ్ర...... సప్తప్రాకారమధ్యే......అనే శ్లోకాలు విష్ణుచిత్తునిచే చదివించడం. అది మహా అసందర్భం. అసలు విష్ణుచిత్తుడు కృష్ణభక్తుడని చెప్పారు. నిజమే. కాని అనునిమిషమూ అతనిచే రంగస్తవం

చేయించడం, రంగా! రంగా! అనిపించడం ఏమిటి మరి ? ఇంకొకటి సంప్రదాయం తెలియని లోపం. పాండ్యసభలో గెలిచిన తరువాత విష్ణుచిత్తునికి గజారోహణోత్సవం జరిగిన సందర్భంలో ఆయన శిష్యులు 'పల్లాండు,పల్లాండు' అనే పాశురం చదివారు నాటికలో. అసలు అది 'మంగళాశాసన పాశురం. గజమెక్కి నప్పుడు విష్ణుచిత్తునికి భగవంతుడు గరుత్మంతు నెక్కి ఆకాశంలో సాక్షాత్కరించగా, ప్రాకృతుల దృష్టిదోషం భగవంతునికి తగులుతుందేమోనని భక్త్యుద్రేకంలో విష్ణుచిత్తుడు భగవంతునిగూర్చి చేసిన మంగళాశాసనం అది. దాన్ని (విష్ణుచిత్తుని రచనను) విష్ణుచిత్తుని విషయంలో శిష్యుల ద్వారా ఉపయోగించడం పూర్తిగా అసంబద్ధం...ఇంకా, భగవంతుని కర్పించే పూమాలలలో అండాళ్ కేశం వచ్చిందని తెలిసిన విష్ణుచిత్తుడు దాన్నేమంత పెద్దవిషయంగా గ్రహించకపోవటం కుదరని విషయం. ఈ కేశ విషయం పాశ్చిక ఐతిహ్యం. కాని దాన్ని కథలో ప్రవేశపెట్టినప్పుడు దానికనుగుణంగా కథనడవాలి గాని, మరోవిధంగా అయితే కథ దెబ్బతింటుంది; అల్లాగే జరిగిందీన్నూ. మరోటి ఏమంటే విష్ణుచిత్తుని పాత్రకు సరైన వాతావరణం కల్పించబడలేదు. గోవింద కేశవులు చెత్తరకం హాస్యగాళ్లుగా నాటికలో తయారయినారు. వీరి హాస్యం ఇవ్వకున్నా పోయేదేమీలేదు. ఇవ్వడంవల్ల అసలు విషయంయొక్క ఔదాత్త్యం అడుగారింది. అయితే ఈ లోపాలున్నా శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారి సంగీతం చాలా ఆకర్షించింది.

శ్రీ పాలగుమ్మి సంగీతంతో చాలా విజయవంతమైన మరో నాటిక, 23-7-59 నాటి, అఖిల భారత రూపక కార్యక్రమమూ, నాటక సప్తాహ కార్యక్రమమూన్నూ అయిన శ్రీ సి. నారాయణ రెడ్డి 'రామప్ప'. అసలు రామప్ప కథకూ కోణార్కకు సంబంధించిన కుమార శిల్పికథకూ చాలా సామ్యం ఉంది...గుడిలో రామలింగేశ్వరస్వామి అనే దేవుడు ఉండడంవల్ల దానికి 'రామప్ప గుడి' అని పేరు రాలేదు. రామప్ప అనే శిల్పివల్లనే ఆ పేరు వచ్చింది. ఎందుకంటే ఆ ప్రాంతంలో 'అప్ప' అనే ఉపపదంచేర్చే సంప్రదాయం ఏనాడూ లేదు. ఆ 'శిల్పి' రామప్ప అన్యప్రాంతంనుండివచ్చినవాడు కాబట్టి అతని పేరు ఉండడం సబబే. ఆ గుడి నిర్మాణంలో అతడు ప్రాణాలు వదలిపెట్టాడు కాబట్టి, లేక మరేకారణమైనా కావచ్చు ఆగుడికి 'రామప్ప' అనేపేరు వచ్చింది. అయితే ఈనాటికలో శిల్పిపేరు చంద్రభూషణ్ ......చరిత్రచెప్పని వేళ జనశ్రుతే చరిత్రకు ఆధారం. అజనశ్రుతి ఈనాటికలో లోపించింది...ఇంకొకటి. కళాకారులు ప్రేమ, సౌందర్యం ఇత్యాదుల్లో చాలా ఉదారాభిమానాలు కలిగిఉంటారు. జాయప నాట్యకళాకోవిదుడు, పైగా 'నృత్తరత్నావళి'కర్త కూడా. అతను, నాగియందు శిల్పికిఉన్న భావాన్ని తుచ్ఛకామంగా భావించి శిల్పినీ, నాగినీ మట్టుపెట్టేంతదాకా వచ్చేట్టు చేయడం కళాకారులకు అవమానం లాంటిది. రుద్రసేనానిచే ఈకర్మకాండ అంతా చేయించినా బాగుండేది. శిల్పిభావాన్ని అర్థంచేసుకోలేక పోవడం అతనిపాత్రకు లోపం కాదు. ఇంకా....జాయప నాగికి శిక్షవిధించిన తరువాత అతని ఆలోచనలో నాగికి ఆ (ఉరి)శిక్ష విధించడం తప్పుఅనే తోస్తుంది.దాన్ని ఘనిష్టం చేయడంలో ఉన్నఅందం, నందీశ్వరుణ్ణి జాయప కలలోకిరప్పించి పండావిడి చేయడంలో లేదు. ఈ 'పండావిడి' చేయనే తల్చుకుంటే జాయపకు ఆశిక్ష తప్పు అనేఊహ రాకుండాచేస్తే బావుండేది ..... నాగిపాత్రయాస ములుగు (రామప్పగుళ్ళ) ప్రాంతందికాదు. ఉన్నయాసకూడ సరిగా నిర్వహించబడలేదు...నాటికలో సినిమాకు కావలసిన సర్వహంగులూ దాదాపు ఉన్నాయి. శ్రీ రెడ్డి పద్యాలు చదివినవిధం బాగుంది. ఈనాటిక అనువదింపబడ్డ ఇతర భాషల్లోకన్నా సంగీతం దీనిలో విజయం సాధించింది.

ఇదే శ్రీ పాలగుమ్మి సంగీతం 29-7-59 నాటి శ్రీ త్రిపురనేని గోపీచంద్‌గారి, హైదరాబాదు నుండి ప్రసారమైన 'తత్త్వమసి' నాటికలో రక్తి కట్టలేదు. అసలా నాటికే అయోమయంగా ఉంది. పేరుకీ విషయానికీ సంబంధం సరిగా ఉన్నట్టులేదు. అసలు ప్రసిద్ధార్థవంతాలైన పద, వాక్యాలకు, అప్రసిద్ధమైన తత్పదార్థాన్ని మాత్రమే గ్రహించడంవల్ల 'అపుష్టార్థం' దోషం కలుగుతుంది. అది ఈనాటికలో కలిగింది...తత్త్వమసి అనే దాని వెనుక బోలెడుకథా-కమామీషూ ఉంది. అద్వైతుల మహావాక్య చతుష్టయంలో ఇదొకటి. ఛాందోగ్యోపనిషత్‌లో సద్విద్యాభాగం చివరి వాక్యం ఇది. 'సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్' దగ్గరి నుండి సద్విద్యాభాగం ఆరంభం. ఏక విజ్ఞానంవల్ల సర్వవిజ్ఞానం కలుగుతుందనే విషయానికి సంబంధించింది ఇది. అద్వైతులు 'తత్త్వమసి' అనేదానికి ఆ బ్రహ్మ నీవై తివి అని 'జహదజహల్లక్షణ' ప్రకారం అర్థం చెబుతారు. విశిష్టాద్వైతులు 'బ్రహ్మాత్మకుడ వైతివి నీవు' అని అర్థం చెబుతారు. ఎవరెల్లాగైనా సోపపత్తికంగా వాళ్ళు దాన్ని అన్వయించుకొన్నారు. 'ఇంత' ఉన్న ఇది ఈ నాటికకు నప్పదు. అసలీ నాటిక చెప్ప దలచిన విషయం, అన్ని భావాలూ అర్థసత్యాలే. వాటియందలి సానుభూతే సంపూర్ణ సత్యమైన దివ్యశక్తికి దారిచూపుతుంది. ఈ సానుభూతి పరుడు ఆ దివ్యశక్తి స్పర్శ అనుభవించి క్రమేపి అదే అవుతాడు. ఇత్యాది. దీనికి ఈ నాటికలోని 'ప్రకృతి పురుషవాదం' లాంటి అంతర్నాటిక ఏ విధంగా బలకరం లేక నిరూపకం అవుతుందో అర్థంకాదు. అసలు ఆధునిక నాగరకతను విమర్శించ డానికి ఈ అంతర్నాటిక కల్పితమైనట్టు అనిపిస్తుంది. దానిలో ప్రకృతి పురుషులు పరస్పరం తామే గొప్పవారమనీ, నిన్నంటె నిన్ను నాశం చేయగల మనీ, వాగ్యుద్ధం చేస్తారు. మధ్యలో ప్రకృతి తన శక్తి ప్రదర్శనం చేయగా, ప్రజలచే నిరాకృత అయిన 'సంస్కారం' పురుషునిలో లీనమై భద్రత పొందుతుంది. చివర చివర ప్రకృతి పురుషుని అతిక్రమించిందన్నట్టు ఉంది. అప్పుడు పురుషుడు మేకపోతు గాంభీర్యంతో, నువ్వు వేరు, నేను వేరు ఏమిటి? నువ్వే నేను, నేనే నువ్వు' అంటాడు... ప్రకృతి, పురుషుడు, ప్రజలు ఏమిటి? అద్వైతమా? విశిష్టాద్వైతమా?. తత్త్వత్రయం అద్వైతులది కాదు. విశిష్టాద్వైతంలో పురుషుడు పరమాత్మ అవుతే ఉంటుంది. కాని ఆ పరమాత్మ సర్వాధికుడు. నాటికలో ప్రకృతి పురుషుని అతిక్రమించింది. ప్రకృతి, పరమాత్మ (పురుషుడు) ఏ మతంలోనూ ఒకటికారు. ఈ నాటికలో గీతంలోని 'యచ్చాపి సర్వభూతానాం' అనే 11 అధ్యాయంలోని శ్లోకం. 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనే 18 అధ్యాయంలో శ్లోకం ఉదహరింపబడ్డాయి అసందర్భంగా. 'సాధ్య సాధనములు, గమ్యగమనమ్ములూ, ఏకమై పోయెను చిలుకా!....ప్రకృతియే పురుషుండు. పురుషుడే ప్రకృతిగా ఏకమైపోయేరు చిలుకా!... మనసులో దీపమ్ము ఘనముగా వెల్గితే పరమాత్మ కన్పించు చిలుకా! అనే ఈ పాట సమన్వయంకాని అర్థంకలది...అద్వైతమూకాదు, విశిష్టాద్వైతమూ కాదు. ఈ రెండూ అర్థంకాక ఏదో క్రొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించబోయి, అసలు విషయాన్ని అస్తవ్యస్తంచేయడం ఇది. ఆకాశవాణి అధికారులు, నిర్ణాయకులు తమ చేతిలోపనేగదా అని ఇల్లాంటివి ప్రసారంచేసి శ్రోతలకు బాధకల్పించటంఅన్యాయం

'దున్నేవానిదే భూమి' అనే సిద్ధాంత ప్రచారం కోసం 31-7-59 న హైదరాబాదునుండి ప్రసారమైన శ్రీ దాశరథిగారి 'దూరపుకొండ' అనే నాటిక, ఆ ప్రచార కార్యం సరిగా చేయలేదు సరిగదా. సమస్యను హాస్యప్రాయం చేసింది. ఈ సమస్య-తన స్వరూపాన్ని విడిచి - నాయికా నాయకుల పెళ్ళికి ఒక 'ఎత్తు'గానే తన స్వత్వాన్ని నిలుపుకుంది అందువల్ల అసలు నాటిక ఉద్దేశ్యం చెడింది.

22-7-59 న సంగీత నాటక సప్తాహ కార్యక్రమంగా, బుధవారపు నాటికా రూపంగానూ్న శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'సిద్ధేంద్ర యోగి' నాటిక విజయవాడనుండి ప్రసారితమయింది. వారి ఏకవీరలోని సిద్ధేంద్రయోగి కథ ఇందులో కుదించబడనట్టుగా కుదించబడింది. అసలు అరగంటకు ఒదుగని కథే అయినా ఒదిగినట్లనిపిస్తుంది. ఇందులో ముఖ్యంగా సిద్ధేంద్రయోగి భామా, గొల్లకలాపాలను రాయడానికి కారణం నిరూపించబడింది. అతని పూర్వాశ్రమంలోని భార్యకు, మానసికంగా సంసార సుఖానుభవం కొరకు శృంగారపూర్ణమైన భామాకలాపం, సంతాన సుఖానుభవం కొరకు గర్భోత్పత్తిత్యాది విధాన నిరూపకమైన గొల్లకలాపం రచింపబడ్డవట. కృష్ణానదీ ప్రవాహధ్వని సరిగా లేదు.

5-8-58 న బుధవారపు నాటికగా శ్రీమతి కూపాబాయి మోతీలాల్‌గారి 'సంఘమిత్ర' ప్రసారమైంది. బౌద్ధమతానికి మూలమైన కారుణ్య వాదం ఇందులో నశించింది. భూరతిస్సుడు తనను ప్రేమిస్తే, తాను నాగబంధంలో ఇరుక్కుని సంఘమిత్ర, అతని ప్రేమను బలవంతంగా, వెంటనే సోదరీ ప్రేమగా మార్చటం బుద్ధమతానికి పనికిరాని ఒక మోసపు తతంగం. అసలు సంఘమిత్రను పాము చుట్టుకొని అంతసేపు కరవకుండా ఉండి,పని పూర్తి కాగానే విడిచి వెళ్ళడం పూర్తిగా అసంబద్ధం. ఇంత అశోకుని కాలంనాటి కథనునాటికగా రాసి, 'విజ్ఞానమన్న ప్రళయవాహినిలో మునిగి' దురూహాలతో ఉన్న విశ్వానికి బుద్ధుని 'పంచశీల'యే ఉద్ధారకము అనే ఈనాటి శ్రీ నెహ్రూగారి రాజకీయ ప్రచారాన్ని ఇరికించడం అసందర్భం, అసంబద్ధమూన్నూ. ఎందుకంటే, బౌద్ధులు విజ్ఞానం కావాలనేవారు. ఈనాడు దుష్టార్థంలో ఉపయుక్త మవుతున్న విజ్ఞానం ఆనాటి బౌద్ధానికి ముడిపెట్టడ మేమిటి?...కంఠధారులవాచికం అధ్వాన్నంగా ఉన్నది. అనువాదేవి, భూరతిస్సులు చాలా పదాలను అపశబ్దాలు చేశారు. అసలు రచయిత్రే 'భిక్షుకి' పదాన్ని, 'భిక్షుణి' గా చేసినప్పుడు ఇక కంఠధారుల ననవలసిందేమి? 'భిక్షుకి' మీద తయారయింది భిక్షుకిపదం. 'భిక్షుకి' అనే అర్థంలో 'భిక్షుణి' పదం లేదు.

మొత్తం నాటికల్లోకల్లా చాలా బాగున్నది. 11-8-59 న మద్రాసునుండి ప్రసారమైన శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారి 'పునరపి'. భారత యుద్ధానంతరం ధృతరాష్ట్రుని దుఃఖం పోగొట్టడానికి వ్యాసుడు గంగాతీరాన తన తపశ్శక్తిచే అతనికి మృతులను చూపిస్తానన్న ఐతిహ్యాం ఆధారంగా వ్రాయబడింది. ధృతరాష్ట్రాశ్రమంలో ఉన్న కుంతిని చూట్టానికి పాండవులనూ అప్పుడే ప్రవేశపెట్టి, కౌరవపాండవులు ఏకదేహులవలె కలిసి మెలిసి ఉన్నట్టు చెప్పడం, అందులోనూ ప్రాకృతుల, ప్రేతల తారతమ్యాన్ని స్పష్టీకరించడం చాలా బాగుంది. మమకారాదు లున్నంతవరకు పునరపిజననం తప్పదనీ, అవి పోతేనే శాశ్వత మోక్షం లభిస్తుందని ఈ నాటిక చేసే నిష్కర్ష. అందు కుదాహరణంగా కౌరవులకు పునరపిజననం కలిగించబడింది. దీనివల్లనే నిజంగా - ఉట్టిదర్శనం వల్లకాక-ధృతరాష్ట్రుని దుఃఖం పోయింది. కంఠధారుల వాచికంకూడా బాగుంది.

3-8-59 నాటి అదే కేంద్రంనుండి ప్రసారమైన శ్రీ కౌండిన్యగారి 'ప్రతిధ్వని' పిల్లల కార్యక్రమానికి తగింది. ఒక తాత తన మనుమనికి ప్రతిధ్వనినిగూర్చి ఊహాకల్పిత జానపదగాథ చెప్పటం ఈ నాటిక. వీరి సంభాషణ సందర్భంలో ప్రతిధ్వని సరిగా నిర్వహించబడలేదు. పైగా సుశ్రుత రాణికి కథలు చెప్పుతున్నదన్న సందర్భంలో విజయావారి మాయాబజారు సినిమాలోని 'విన్నావమ్మా యశోదమ్మా' అనేపాటను ఉపయోగించడం ఘోరం. నిర్వాహకులు ఈ కనీసపు విషయాన్నికూడా గమనించలేకపోవడం శ్రోతల దురదృష్టం.

సాహిత్యనందిని కార్యక్రమంలో విజయవాడ నుండి ప్రసారమైన శ్రీ ఆవంత్స సోమసుందర్ గారి 'రేపటిపాటలకోసం' కథానిక (21-7-59) హైదరాబాదునుండి ప్రసారమైన శ్రీ వేటూరి ఆనందమూర్తిగారి 'విమర్శకు ఎంత విలువ ఇవ్వాలి ?' ప్రసంగమూ (11-8-59) బాగున్నాయి. అయితే శ్రీ ఆనందమూర్తి ప్రసంగంలో ఇంగ్లీషు పద, వాక్యాలు అధికం, వాటి అర్థభావ వివరణ అతిస్వల్పం. ఇది మాత్రం విచార్యం.

మరి ఇదే కార్యక్రమంలో 28-7-59 న హైదరాబాదునుండి ప్రసారమైన శ్రీ ఆచంట జానకిరాంగారి 'నిష్క్రమణ' అనే కథానిక అయోమయంగా ఉన్నది. కథలో కథకుడు తన భార్య నుండి తనకు, వివాహపూర్వమూ, అయిన కొత్తలో వచ్చిన ఉత్తరాలు చదువుకొని, ఆనాటి ఆనందం ఈనాడు లేదని వాపోయి, ఏదో మహానందం కొరకు మానస సరస్సుకు హంసలా పయనమై దొడ్డిదారిన నిష్క్రమిస్తాడు. ఈ దొడ్డిదారి నిష్క్రమణం ఎందుకో-ఏ ప్రయోజనార్థమో తెలియదు. ఈ 'నిష్క్రమణ' బుద్ధుని 'మహాభి నిష్క్రమణ' స్మరణవల్ల జనించింది కావచ్చు. కాని బుద్ధునిది స్వార్థత్యాగపూర్ణం. ఈ కథకునిది సంపూర్ణ స్వార్థం. అనుభూతి అనేదాన్ని పట్టుకొని లాగిలాగి, అసలు అనుభూతి అర్థం కాకుండా చేస్తుందీ కథానిక. 'బూడిద మిగిలింది, అదీ కలిసింది అగ్నిలో' వంటి అర్థంకాని (లేని) వాక్యాలతో నిండిందిది. బూడిద నిప్పులో కలువదు. నిప్పు పరిణామం బూడిద. తా నగ్నిలో వేసిన ఉత్తరాలు, పెట్టె, మొదట అగ్నిత్వం పొంది తరువాత భస్మరూపమైనవి. కథకు ఇల్లాంటివి అడ్డుబాట్లు.

22-7-59 న విజయవాడనుండి 'చపలనుయోధనం' వేణీసంహారంలోని ద్వితీయాంకానికి శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారి రేడియో అనుసరణ దుర్యోధన పాత్రధారి 'రజని' వాచికంతో చెడిపోయింది. అది 'రజని' దోషం కాదు. రిహార్సల్ వేళకూడా ఆ లోపం గుర్తించని నిర్వాహకులది ... నాటకానుసరణలో నాటక లక్షణాల మాట ఎల్లా ఉన్నా, చివరకు సింధురాజమాత ప్రవేశ సందర్భంలో, ఆమె మాట (కంఠం) ముందు శ్రోతకు వినిపించిం తరువాత, కంచుకి ఆమె రాకను రాజుకి తెలిపిన మాట వినిపిస్తుంది. రాజు ఆమెను ప్రవేశపెట్టమన్న తరువాత ఆమె మాట వినిపించడం భావ్యంకాని, అంతకుముందే వినిపించడం అసలు నాటకానికి విరుద్ధమూ, కుదరని విషయమున్నూ.

అయితే 'రజని' కంఠం పై నాటికలో నాటికను చెడగొట్టినా, 27-7-59 నాటి సంగీత సంచికలో ఆయన రచించిన 'వర్షాగమనం' అనే ఇతివృత్తాత్మక స్వరచిత్రం చాలా బాగున్నది.

ఒక విషయం. ఈ రేడియో అధికారులకు నాటిక, సంగీతనాటిక, రూపకం వాక్చిత్రం ఇత్యాదులనుగూర్చి సరిగా తెలియనట్టు అనిపిస్తుంది. ముఖ్యంగా వాక్చిత్రం అనేది అంతకన్నానూ. యుగళ సంభాషణను వాక్చిత్రమనీ, అసలు వాక్చిత్రాన్ని రూపకమనీ, అసలురూపకాన్ని నాటికఅనీ వాటిని చిత్రవధ చేస్తున్నారు. ఇంకొకటి. రేడియో కొనుక్కున్నవాళ్ళు తామేమి, ఎల్లా ప్రసారం చేసినా వింటారనే ఒక 'లాపర్వా' వీళ్ళకు ఘనం ఉన్నట్టుంది... రచనలను స్వీకరించేముందు బాగా పరిశీలించి, అటు రచయితలకూ ఇటు శ్రోతలకూ న్యాయం కూర్చవలసిన బాధ్యతను సరిగా నిర్వహించవలసిన అవసరం ఎంతైనాఉన్నది.

—సామీరి.

చర్చావేదిక :

## మన భాష

రచయితలు వాడేభాష కొంత సంస్కృతీయం గానూ, మిశ్రంగానూ, కేవలం అచ్చికంగానూ ఉండట స్వాభావికం. ఈ పద్ధతి అనూచానంగా మన తెలుగుభాషలో రచయితలందరూ అవలం బిస్తూనే ఉన్నారు. శిష్టులైనవారు ఈ మార్గావలం బనంలో శిష్టంగానే వ్యవహరించారు. తెలుగు, సంస్కృత భాషలను కలగాపులగంచేసి పదతత్త్వాన్ని తెలిసికోలేని కొందరు ఆధునికులు పఠితలకూ శ్రోతలకూ వెగటు పుట్టించేలాగు పదప్రయోగాలు చేస్తూ ఉండటం బాధాకరంగా ఉన్నది. ఈ పద్ధతి ప్రసిద్ధంగా తెలుగు పత్రికల్లో కనబడుతూ ఉంటుంది. పత్రికలు సార్వజనీనంగా వ్యవహారంలో ఉన్నవి. అయినా వాటిలో వాడబడే పదాలు ఒక్కొక్కప్పుడు అనన్వితంగానూ, అపార్థకంగానూ, కనబడుతూ ఉంటవి. మచ్చుకు కొన్ని మాత్రం ఉదహరిస్తాను.

'విదేశీవిధానం' - ఈ పదంలో ఉన్న యకారాన్ని మన పత్రికలవారు మింగేశారు. నిజంగా 'విదేశీయవిధానం' అని ఉంటే వారికిగానీ పఠితలకు గానీ బాధ ఏమిటో తెలియటం లేదు.

'రాచకీయం' - రాజకీయము అనే పదాన్ని రాచకీయం అని, సంస్కృత ప్రత్యయంతో అచ్చ తెలుగును జోడించి విరివిగా పత్రికల్లో సంపాదకీయాల్లో గూడా వాడుతారు. ఈ సంస్కృత ప్రత్యయానికి నిష్కారణంగా కలిగిన దుర్గతి పై శబ్దంలో చూడవచ్చు.

ఇక్కడ సంస్కృత ప్రత్యయం తెలుగు శబ్దానికి చేర్చినట్లే తెలుగు ప్రత్యయం సంస్కృత శబ్దానికి చేర్చిన 'రాజరికం' 'విలేఖరి' ఇత్యాది ప్రయోగాలు కూడా పత్రికల్లో కనబడుతున్నవి.

ఈలాగే తెలుగుశబ్దాలపైన సంస్కృత ప్రత్యయాలు చేరిన 'బానిసత్వం' 'నాణ్యత' వంటిపదాలు కూడా కనబడుతుంటవి.

సులభంగా వీలున్నచోట్లలో ఇటువంటి భాషాదోషాలను వాడటం శోచనీయం. ఎందుకంటే 'విదేశీయవిధానం' 'రాజకీయం' 'రాచరికం' 'విలేఖకుడు' 'బానిసతనం' 'నాణెం' అని వ్యవహరిస్తే పఠితలకు అర్థం కాకపోదు. రచయితలకు కూడా అజ్ఞానదోషం అంటదు.

భాష తొలుత కొత్తదైనా ప్రపంచవ్యవహార ప్రవాహంలో క్రమంగా అది సుపరిచితమౌతుంది. ఈ నాడు మన కపరిచితమైన ఎన్నో ఆంగ్లపదాలను పత్రికలద్వారా సుపరిచితం చేసుకున్నాము. అలాగే సంస్కృతంలో కూడా బహుళప్రచారంలో లేని కాందిశీక, రోదసీ కుహరాదులు పత్రికల ద్వారా ప్రజలకు సుపరిచితం చేశాము. ఒక ఇంటి నుంచి ఒకవస్తువు అరువు తెచ్చుకొన్న వాడెవ్వడూ దాన్ని వికలంచేసి వాడుకోడానికి తెచ్చుకోడు. సంస్కృతంనుంచి తెచ్చుకొన్న పదాలను వాటి కున్న అర్థాల్లో రూపాల్లో వాడుకొనే హక్కు మన భాషలకన్నింటికీ ఉన్నది. కాని మనదగ్గరకు ఆ పదాలు వచ్చేసరికి అవి దుర్గతిపాలు కాకూడదు.

అర్థావగతికి శబ్దం దీపంవంటిది. అట్టిశబ్దము నిస్తేజస్కమైనప్పుడు అర్థస్ఫూర్తి కలగడంలో బుద్ధికి కొంచెం తత్తరపాటు కలుగుతుంది.

పిండి తక్కువగా ఉండి రొట్టె పెద్దదిగా చేయ దలచుకొన్నట్లుగా విద్యావిజ్ఞానాలు తక్కువ ఆర్జించిన ప్రతివాడూ రచయిత కాగోరినందువల్ల భాషకు ఈ అనర్థాలు సంభవిస్తున్నాయని చెప్పవలసివస్తున్నది.

మరికొన్ని దృష్టాంతాలు మనవిచేస్తాను.

'విదేశమారకం' అనేపదం విదేశాలలో మార్పిడికి వాడటం చూస్తే చదివేవారికి మరణబాధ కలుగుతున్నది. మారకం అనే పదానికి 'మార్పిడి' అనే అర్థం ఒకవేళ మనం చెప్పినా 'విదేశ' అనే పదంతో సమాసం అపార్థాన్ని కల్పిస్తున్నది.

'ప్రమాదం' అనేపదం తెలుగులో 'అపాయం' అనే అర్థంలో వాడుకుంటున్నాము. సంస్కృ

తంలో దానికి 'పొరపాటు' అనిఅర్థం. అది అపాయ మనే అర్థంలో వాడుకలో వచ్చింది కాబట్టి మనం వాడవచ్చుఅని మనస్సును సరిపెట్టుకున్నా దాన్ని సంస్కృత కృదంతాలతోనూ సంస్కృత సమాసం లోనూ చేర్చివాడే 'ప్రమాదకర పరిస్థితులు' 'ప్రమాదభరితం' 'ప్రమాదావస్థ' మొదలగునవి ఘోరంగా కనబడుతవి.

ఇల్లాగే 'ఆలస్యం' అనే పదంకూడా వాడు తున్నాము. ఆలస్యం అంటే సంస్కృతంలో 'సోమరతనము' అని అర్థం. తెలుగులో ఆఅర్థంలో ఎక్కడా దానికి ఆధునికంగా ప్రయోగంలేదు. ఆ పదం మనం దత్తుతెచ్చుకొని మనకు నచ్చినపేరు పెట్టుకొనుటం బాగానే ఉన్నది. కాని దాన్ని ఇతర సంస్కృత పదాలతో చేర్చి 'జాగు' అనే అర్థంలో 'ప్రభుత్వాలస్యం' మొదలైనవి వాడటం మాత్రం భావ్యంకాదని మనవి.

సంస్కృతపద స్వరూపం తెలియకుండా 'ప్రాధాన్యత' 'ఐక్యత' 'ప్రాముఖ్యత' మొదలైన అప ప్రయోగాలు ఏకార్థకాలైన రెండు తద్ధితాలతో చేర్చి వాడటంలో తెలుగువారు మాత్రమే సమర్థులు. ప్రాధాన్యము, ఐక్యము, ప్రాముఖ్యము, అంటే పదంలో లాఘవం నిర్దుష్టత్వం ఏర్పడుతుం దని మన వారికి తెలియదు కాబోలు.

కొన్ని కృదంతాలు అచ్చ తెలుగుపదాలతో చేర్చి సమాసం చేస్తూ ఉండటం హాస్యాస్పదంగా కనబడుతున్నది. 'నేరస్థులు' 'నేరస్థజాతులు' 'గరిష్ఠ కమతాలు' 'నేరారోపణ' మొదలైనవి.

'అగ్నిమాపక' అనే పదాన్ని అగ్నిని ఆర్పటం అనే అర్థంలో వాడుతున్నారు. 'మాపకం' అంటే కొలచేది అని అర్థం.

ఇల్లాగే దుష్టసమాసాలు 'స్వాతంత్ర్య పోరాటం' 'కనీసవేతనం' 'ఐక్య అరబ్బుసమాఖ్య' 'కృత్రిమ రబ్బరు' 'అధికనూనెధర' 'కేంద్రసలహాసంఘం' 'బాణసంచా''ప్రభుత్వజోక్యం' 'వినియోగదారులు' ఇత్యాదులు గమనించదగిన విషయాలు. గమనం అనేపదం సంస్కృతంలో పోవుట అనే అర్థంలోనే వాడబడుతుంది. తెలుగులో జ్ఞానం లేక తెలిసికోవడం అనే అర్థంలో కూడా దాన్ని వాడుతారు. ఈ అర్థంలో వాడడం ఒకవేళ గత్యర్థ ధాతువునకు జ్ఞానార్థకత్వం కూడా ఉంది కాబట్టి మనం వాడవచ్చు అని సమాధానం చెప్పినా దాని పైన తద్ధితంచేర్చి 'గమనీయమైన విషయం' లాంటిది వాడటం చెవులకింపుగా ఉండదు. గత్యర్థ ములకు జ్ఞానార్థకత్వం అంగీకరించిన సంస్కృత భాషలోకూడా జ్ఞానానికి కేవలం గమనం అని వ్రాయరు. ఉపసర్గచేర్చి అవగమనం అని వ్రాస్తారు. ఇక్కడ కొన్ని పదాలు మాత్రమే చూపబడ్డవి. కాని ఇటువంటి అపప్రయోగాలు వందలూ వేలూ విబుధులకు కనపడుతూ ఉండడం వారు విచార పడటం వారి విచారాలను రచయితలు నిర్లక్ష్యం చేయటం జరుగుతూ ఉన్నది.

శరీరానికి భూషణాదులచేత అందచందాలు కూర్చడం బాగుంటుంది కాని అవయవాలు ఖండించి, వాటిని వికృతపరచి, శరీరాన్ని శోభింప చేయజాలముకదా! అట్లా చేయడమే ప్రగతిసాధన అని భావించే విద్వాంసులు బయలుదేరి భాషకు మహోపకారం చేస్తున్నారని తోస్తున్నది.

—"కౌశిక"

## కతిపయప్రయోగ పరిశీలనము

బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి గారి వ్యాకరణ సంహితా సర్వస్వములోని సిద్ధాంతములకు విరుద్ధములగు ప్రయోగములు కొన్ని ప్రామాణిక కావ్యములలో జూపట్టుచున్నవి. ముద్రణములు సుపరిష్కృతములు కాకుండుటచే నందులో సంస్కర్తృ ప్రమాదకృతములేవో కవి ప్రయుక్తములేవో నిర్ణయింపవలసి యున్నది. కొన్ని ప్రయోగములనుగూర్చి యట్టి పరిశీలనము జరుపుటకీ వ్యాస ముద్దేశింపబడినది.

1. **ఋత్విక్కు మొ. :** 'ఋత్విక్కు' సాధువను టకు "కవిప్రయోగ ప్రామాణ్యములేదు" (642పు.) అని వ్రాసి శ్రీ శాస్త్రిగారు దీని నపశబ్దముగా దలంచిరి. "స్రుక్కుల విఱిచి ఋత్విక్కుల బాధించి, సదమదంబున సభాసదులదోలి" (వరాహ 5-115) అను వరాహ పురాణమునందలి ప్రాసయతి స్థల ఘటిత ప్రయోగము దీని సాధుత్వమునకు ప్రబల ప్రమాణమగుచున్నది. దీనిని గూర్చి శ్రీ శాస్త్రి గారికి వ్రాయగా నిపాతన్యాయమున సాధుత్వము నరయుడని ప్రత్యుత్తర మిచ్చిరి.

దకారాంతములు ద్వితీయైకవచనతుల్య ప్రాతి పదికములు గలవి కావున "పరిషత్తు, ఉపనిషత్తు" అను వానికి ప్రయోగములు కనవ్పట్టుచున్నవని శ్రీ శాస్త్రిగారికి మనవి వ్రాసితిని. (కాశీ 2-69, 2-151, 7-233) ప్రాసాదిగతమగు ప్రయోగ మును జూపుడని వారు వ్రాసిరి. ప్రాసాదిగత ప్రయోగము లభింపకపోవుట మాత్రము నిజమే. కాని కాశీఖండ ప్రయోగములలో "పరిషదము, ఉపనిషదము" అను రీతిని నిల్పుట కవకాశములేదు గాన ప్రమాణములగునా? యని యాలోచింపవలసి యున్నది. "ఉపషత్తులు ఘోషింప నొక్కపెట్ట" (హర) అను శ్రీనాథ ప్రయోగమున "ఉపనిషద ములు"నిల్పనగును. "ఉపనిషత్తుల భావమొక్కరీతి" "సౌరభహీనమౌ నుపనిషత్తులు" అను నైషధ క్రీడాభిరామ ప్రయోగములలో "ఉపనిషత్తతి" కవిపాఠమనవచ్చును. కాశీఖండప్రయోగములు మూటి నిట్లు సవరింప నవకాశము లేదు. కావున వీనిని నిపాతన్యాయమున నంగీకరింపనగునని తోచు చున్నది.

2. **ప్రహ్రేతర లఘుత్వము:** "ప్రహ్రేతరసంయుక్త పరకత్వమున లఘుత్వము ప్రామాణిక కవిప్రయో గములలో లేదు" (68 పు.) ఈ సిద్ధాంతమును ప్రతిఘటించు ప్రయోగములు గోచరించుచున్నవి.

(1) కూటక్రోడావతారుడై కైటభారి (శివరా 1-60.)

(2) దంష్ట్రక్రోడావతారుడై ధాత్రియెత్తి (శివరా 1-68.)

(3) దంష్ట్రక్రోడావతార ముద్ధతివహించి (శివరా 1-77.)

ఈమూఁడుచోట్ల 'క్రోడ' శబ్దపర్యాయమగు 'కోల' శబ్దము కవిప్రయుక్తమై యుండునని శ్రీ శాస్త్రి గారు నాపేర వ్రాసిరి. 'కోల' శబ్దమునునిల్పిశివరాత్రి మాహాత్మ్యమున ముద్రితమైన 'లడ' ప్రాసమును సైతము వారించుకొనుట లెస్సయని తోచు చున్నది. (శివరా 1-59.)

"పాతాళ శ్రీకాళ భైరవస్వామికి" (భీమ 4-27.) అను భీమఖండ ప్రయోగమునుగూర్చి శ్రీ శాస్త్రిగారికి వ్రాసితిని. "పాతాళసిరికాల భైరవస్వామికి" కవిపాఠ మనవచ్చుననియు 'శ్రీ' చోట నిట్టిమార్పులు కవి ప్రయోగదృష్టము లగు చున్నవనియు నభిప్రాయపడిరి. తమ సవరణమును బలపఱచు ప్రయోగాంతరము లభించిన బాగుండు ననియు వ్రాసిరి. పరిశీలింపగా "మందర క్రీడా కృత్తిరుకాలశైలకృదజ శ్రీ శంగశృంగంబులన్" (కాలహ 4-69) అను ధూర్జటిప్రయోగము నేత్ర విషయాభావమును భజించినది. "తిరు కాల శైలము=దీనిని రామగిరియందురు" అని టీకా కర్తలు వ్రాసినారు. ప్రబలప్రయోగము కాదుగాని "గారవ ముల్లసిల్ల సిరికాకుల నాథుఁడు" (క్రీడా 207 ప.) అని క్రీడాభిరామములో శ్రీకాకుళము సిరికాకుళముగా వాడబడినది. పై ధూర్జటి ప్రయో గమునుబట్టి "పాతాళ తిరుకాల భైరవస్వామికి" అనిగాని "పాతాళ సిరికాలభైరవస్వామికి" అని గాని శ్రీనాథపాఠ ముండియుండునని నిర్ణయింప దగును. భీమఖండముననే వేఱొకచోట "కర గ్రహణ సుమంగళైక కౌతుక సంపత్పరిపూర్ణ హృదయు" (భీమ 3-164.) అని ముద్రిత మయ్యెను. "కరగ్రహణ మంగళైక" అనునది కవి ప్రయుక్తపాఠము కానోపును. కాగా "ప్రహ్రే తర" లఘుత్వమును నిర్వహించు ప్రామాణిక

ప్రయోగము మృగ్యమనియే సారాంశము. "కస్మి జ్జీవసి హే సఖే విషక్రిమిన్యాయేన జీవామ్యహమ్" అను నుదాహరణము తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున జూపియున్నాడు. "విషక్రిమి" అనుచో "విషకృమి" సరియైన పాఠమగునని శ్రీ వజ్ఝలవారు నాతో ననిరి.

3. **మధ్యమపురుషక్రియేకారసంధి :** "ఎట్టుగ నేగుదెంచితిరి యిందుకళాధర భృత్యులార" (శివరా 4-56) అను శ్రీనాథ ప్రయోగమును గూర్చి వ్రాయగా "ఎట్టుగ నేగుదెంచిరిటిందు కళాధరభృత్యులార" కవిపాఠము కానోపునని సమాధాన మొసగిరి. "ఎట్టుగ నేగుదెంచితిరో" అన్నను క్షతిలేదు. కాన నిది పై సంధి పాక్షికతకు బ్రమాణము కానేరదు.

4. **శంభు ప్రథమైకవచనము :** "రాహు శబ్దేతరములగు నిట్టివి (వువర్ణ విరహితములు) తిక్కన--శంభుదాస-నాచన సోమన-శ్రీనాథాదుల ప్రబంధములలో నొక్కటనేని గన్పట్టకుండుటచే వీని సాధుత్వము సందేహాస్పదమగుచున్నది" (561 పు.) "శంభు సర్వజ్ఞుడగుట లాక్షణికవృత్తి" (శృ. నై 8. 140.) అను శ్రీనాథుని ప్రయోగము మాత్రమొక్కటి కన్పట్టుచున్నది. "శంభుసర్వజ్ఞుడనుట లాక్షణక వృత్తి" అని చెప్పవచ్చును గాని యధర్వణసమ్మతి యుండుటచే దీనిని రాహు శబ్దముతో పాటుగా గ్రహింపవచ్చునని తోచుచున్నది.

5. **ఏమి యేమి - ఆమ్రేడితసంధి :** 'ఏమియేమి' యను "సంధ్యభావమునకు బ్రయోగము కన్పట్టలేదు. 'ఏమియేమి' అనునది సాధువే కాదు" (253 పు.) అని శ్రీశాస్త్రిగారు వ్రాసినారు ఈ క్రింది పింగళిసూరన ప్రయోగములు గోచరించు చున్నవి.

గీ. ఏమియేమియొనాడు నీహృదయమునను
గోర్కి యొక్కటి కలుగుట కొమ్మ వింటి
(కళా 3-144)

"దా. నాదిప్రోద్భవ మేమియేమి కల దాయా
పుణ్యా మీవర్షపీడాదోషంబును" (కళా
4-93.)

"ప్రేమభంగులు తా నేమియేమివ్రాసి,
యనిపినాఁడొ (ప్రభావ 4-45)

శ్రీ శాస్త్రిగారికి వ్రాయగా వారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి.

"ఆమ్రేడ్యతే అసకృదుచ్చార్యత ఇత్యామ్రేడితమ్ ఆఙ్ పూర్వో మేడృ ఉన్మాదే ఇతిధాతుః" అను నమర పద పారిజాతము చొప్పున నేకార్థబోధక శబ్దముల నున్మత్తునివలె రెండుసార్లుచ్చరించినపుడే యది యామ్రేడిత స్థలము కాఁగలదనియు, సూరన ప్రయోగములలో వక్తల సందేహాదులు భాసిల్లుచున్నవే కాని యున్మత్తులవలె నుచ్చరించుట కనరాదనియు, నందుచేత నివి యామ్రేడిత సంధ్యుదాహృతులు కావనియు వారి సమాధానమునకు సారాంశము. "ఏది యేదీ" (కళా 1-94)" "ఎంత యెంత" (ప్రభావ 3-82) అను ప్రయోగములు కూడ నిట్లే సుసమాధేయము లనదగును. ఆమ్రేడిత శబ్దమునకు వాచస్పత్య శబ్దకల్పద్రుమములలో శ్రీశాస్త్రిగారు తెల్పినట్లే యర్థము చెప్పబడియున్నది. "ఆమ్రేడిత-ఆ+మ్రేడ-ఉన్మాదే అచ్ ఆమ్రేడేన ఉన్మత్తేనవాచార్యతే...ఉన్మత్తేనయథా కథితస్య పునః పునః కథనం క్రియతే ఏవంద్విస్త్రిః కథితం..." (వాచస్ప) "ఆమ్రేడితమ్ - క్లీ - (ఆఙ్ - మ్రేడ- క్తః) ద్విస్త్రిరుక్తమ్...ఉన్మత్తేన యథా కథితస్య పునః పునః కథనం క్రియతే ఏవం కథితస్య ద్విస్త్రివార కథనమ్" (శబ్దకల్ప).

7. **తిరిపము - భిక్షుకుడు :** "తిరిపము - అను మువర్ణాంత రూపమునకు భిక్షుకుడను నర్థము సరికాదని తోచుచున్నది. ఉదాహృత కవి ప్రయోగము లచట 'తిరిపము' అను రూపమును నిర్ణయింపజాలి యుండలేదు" (1725 పు.) అని వ్రాసి శ్రీ శాస్త్రిగారు శబ్దరత్నాకరాదులను విమర్శించిరి. "ఇది కట్టడి తిరిపములకు" (కాశీ 7-52) అని కాశీఖండపు

నూతన ముద్రణమునఁ గలదు. పూర్వ ముద్రణములలో 'కట్టడ తిరువరులకు' అని యున్నది. కావున 'తిరిపరులకు' కవి ప్రయుక్త పాఠము కానోపును. 'తిరిపరులఁ జేసి' (దశకు 3-104) వేయేల 'తిరిపరి' శబ్దము నొద్ద శబ్దరత్నాకర కర్త యీ కాశీఖండ ప్రయోగమునే యుదాహరించుటచే 'తిరిపరులకు' కవి పాఠమనుట నిర్వివాద విషయము.

**విశ్వామిత్ర - స్వరప్రధానయతి :** "విశ్వామిత్ర శబ్దమున 'అ' కారము విఱిచి స్వరప్రధాన యతిని బ్రయోగించుట ప్రామాణిక కావ్యములందు గాన వచ్చుట లేదు" అని శ్రీ శాస్త్రిగారు వ్రాసినారు. (192 పు.) "ఆతన్వంగి పయిం బ్రియం బొదవి విశ్వామిత్రుఁ డీక్షించుచున్ (శృ. శా. 2-141) అను పినవీరన ప్రయోగము కన్పట్టుచున్నది.

తాళపత్త్రి మాతృకలు తప్పుల తిప్పలనియు నాంధ్ర గ్రంథములు సుపరిష్కృతములు కామిం జేసి వానిని యథాస్థితముగా బ్రమాణీకరింప నవకాశము లేదనియు బరిశోధకులు గ్రహింపవలసి యున్నది. లక్షణ నిర్ణయమునకు యతిప్రాసాది నిబద్ధస్థల ఘటితములగు ప్రామాణిక కవి ప్రయోగములు చూపబడుట యావశ్యకము. సామాన్య కవుల ప్రయోగములు శాసన కవుల ప్రయోగములు ప్రబల ప్రమాణములుగా స్వీకరింపబడవు. శాసనములు భాషాస్వరూపమును దెలిసికొనుటలో గూడ సాకల్యముగా బ్రమాణము లనుటకు బాధకము లుండగా శబ్ద సౌష్ఠవదాయక మగు వ్యాకరణమునకు శాసనపద్యములు ప్రబల ప్రమాణములుగా గ్రహింపవలెనని కొందఱు తలంచుచుండుట యవిమర్శకృతము.

—గాండీవి

## వ్యవహారభాష - వ్యాకరణం

వాస్తవానికి తెలుగునాట ఒక దశాబ్దంపాటు శక్తిమంతమైన సాహిత్య పత్రిక లేకపోవడంవల్ల ఏర్పడిన అనర్థం తొలగించడానికి నవభారతి బయలు దేరింది. భారతి ఎంతవరకూ సాధించగలిగిందో నవభారతికూడా అంతే చేసింది. అందుచేత జయంతి వస్తూన్నదంటే కొంతఆశ కలగకపోలేదు. ఆశించినట్టు జయంతి సాహిత్య సంగ్రామాలకు అంకురార్పణ చేసింది. విరుద్ధభావ ప్రపంచంలో సంఘర్షణ ఏర్పడితేగదా నిగ్గుతేలి నిజం నిలిచేది. అందుచేత సౌందరనందంమీద ఝంఝుమారుతం సాగించిన సీతారామారావుగారు గురజాడమీద నడిచారు. కొందరి కవిత్వానికి బలం ఉంటుంది. (బలమంటే నాఊహాలో తిండికలిగిన కండపుష్టి కాదు. ఉదాత్తభావాలతో సుకుమారపదాలతో నిండి ఉండడమని మాత్రమే). ఆ బలం కొంత సౌందరనందానికి ఉన్నది. అలాకాక కొందరువ్యక్తులకు బలగంఉంటుంది. పటిష్ఠమైన కావ్యంమీద జరిగే చర్చలో సమర్థులే ప్రవేశిస్తారు. బలగం కల వ్యక్తి కవిత్వం అనేపేరుతో వదిలిన విషయం మీద వారి పరివారమంతా ఎదురొస్తారు. అది గురజాడ విషయంలో జరిగింది. ఇక ఇప్పుడు వ్యవహార భాషమీద నడుస్తోంది. స్తిమితంగా కూర్చుని రెండుఘడియలు ఆలోచిస్తే రోజూరోజూ మారేభాషకు వ్యాకరణం వ్రాయడం అనవసరమే అనిపించకపోదు. కొంత కాగితం పాడు చేయడం, కొన్ని శాలువాలు కప్పించుకోవడంతప్ప వ్యావహారిక వ్యాకరణ ఘనకార్య ప్రయోజనం లేదు. దానిమీద జయంతి 10 సంచికలో కొండముదివారూ, మరొక చపలగారూ సాగించినదాడి మరీ నీరసంగాఉంది. ఉపకీచకులు భీముడిమీద పడ్డట్టుంది. సాహిత్య విషయంగానీండి, శాస్త్రచర్చ కానీయండి మనకు కొంత సత్తాఉండాలి. అంతే కానీ మన అభిమానాలూ పక్షపాతాలూ కాదు కావలసింది. ఆ సత్తువలేకుండా ఏదో మనంకూడా ఇందులో దిగిచూద్దాం అనుకుంటే సముద్రమధ్యంలో ఈత నేర్చుకోబోయినట్టే ఉంటుంది. జయంతి సంపాదకులయినా ఇటువంటి నీరస వ్యాసాలను ప్రచురించకపోతే పత్రిక ఉదాత్తంగా ఉంటుంది.

—తిషశ్రీ

## పుస్తకసమీక్ష :

### శ్రీమద్భగవద్గీత

అనువాదకుడు : హసజ

పుటలు 111 — వెల రూ. 2.00

వ్యావహారికంలో గీతానువాదం ఇదే మొదలు కాదు. కవిత్రయ భారతానికి వ్యావహారికరూపం తెస్తున్న పురిపండా ఒకటి ప్రకటించారు. ఇంకెవరైనా చేశారేమో తెలియదు.

ఎంతమందిచెప్పినా, ఎన్నివిధాల చెప్పినా ఇంకా చెప్పవలసినసారం మిగిలే గ్రంథాల్లో భగవద్గీత ప్రప్రథమం. కూర్చోవడమూ, నడవడమూ కాక పరుగెత్తడమూ, పారిపోవడమూ అలవాటైన ఈ కాలంవాళ్ళచేత కూడా గీత చదివించేందుకు కొత్త కొత్త ఉపాయాలు పన్నారు హసజగారు ఈ అనువాదంలో. అందుకు వారిని అభినందించవలసిందే.

కాని గీతాపరమార్థం అందరికీ అందడం ఎప్పటికీ సాధ్యంకాదు. ఉత్తమాధికారికి కూడా కష్టసాధ్యమైంది. అందులో కష్టమైంది భాష కానేకాదు, భావం. అంచేత ఇలాంటి అనువాదాల ప్రయోజనం సందేహాస్పదమే.

అయినా హసజగారి ప్రయత్నం ఈ కాలానికి సహజమైంది, సముచితమైంది. ఈ అనువాదాన్ని అక్షరాస్యు లందరూ చదవవచ్చు

హసజగారి వ్యావహారికం ఇంకా ఎంతో బాగుండవలసింది. మొదటి వాక్యంలోనే 'నావాళ్లు' 'పాండవులకు' విశేషణమనిపించే అవకాశాన్ని కామా నివారించదు. దీర్ఘమే శరణ్యం. మూలంలోని సంబోధనలన్నీ అనువాదంలో గుప్పించడం అంత రమణీయంకాదు. అందులో "భారతా! కాబట్టి" మొదలైనవి మరీ ఇబ్బంది. వెనుకటి శ్లోకంతో అన్వయించవలసి ఉన్నప్పుడు ఇలాంటి సంబోధనలు విడిచిపేస్తేనే బాగుంటుంది.

అనువాదంలోకంటె చేసినకొద్ది వ్యాఖ్యానంలోనూ పేచీ విషయాలు చాలా ఉన్నాయి. గీతను కర్మశాస్త్రమే అనడం, శాస్త్రమని ఒకపక్క అంటూ మరోపక్క స్వాతంత్ర్యం వహించి వేరు వేరుచోట్లఉన్న వాక్యాలను కలిపి సందర్భంతో సంబంధంలేకుండా ఇష్టమైన అర్థాలను కల్పించుకోవడమూ గీతాశాస్త్రం శ్రుతిసార మనుకునే వాళ్ళకు సహ్యంకావు.

'ప్రజా క్షేమంకోసం పాటుపడు (అ 3-20 21) ..........మంచిని చేసేవారికి దుర్గతిఅనేది లేదు. (అ 6 40.)'

ఇలాంటివి ప్రీతికరాలు కావచ్చు గాని శ్రేయస్కరాలు కావు.

రాజకీయ నాయకుల చేతుల్లోకి భగవద్గీత వచ్చాక జరిగినదీ, జరుగుతున్నదీ అంతా దాని ఉపదేశానికి విరుద్ధమే. సామాన్యజనులకు బుద్ధిభేదం కలిగించి అభ్యుదయ హేతువైన ప్రవృత్తినిగూడా పోగొట్టారు మహానుభావులు.

కర్మల్లో అభినివేశం కలగాలి జనానికి. అప్పుడే దేశానికి అభ్యుదయం. దానికి గీతను అందరూ అందరికి చెప్పడం మానేస్తేనే మంచిదేమో!

శ్రీపాదరేణువు.

### పంజరం (నాటకం)

రచయిత : శ్రీ అవసరాల సూర్యారావు

ప్రచురణ : విశాలాంధ్ర ప్రచురణాలయం

పేజీలు : 116 — వెల : రు. 50 న. పై.

తెలుగు నాటకాలనుగురించి, నాటక రంగాన్ని గురించి సదభిప్రాయం ఉన్నవాళ్ళను ఈ రోజుల్లో వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. తెలుగు వాళ్ళకు 'కన్యాశుల్కం' తరువాత చెప్పుకోదగ్గ నాటకమే లేదనేవాళ్ళు తక్కువకాదు. ఆ కన్యాశుల్కం కూడా నాటకంకాదనేవాళ్ళు ఇప్పుడు చాలమంది బయలుదేరుతున్నారు.

ఈ అభిప్రాయానికి కారణాలు పరిశీలిస్తే మనకు విశదంఅయ్యే విషయాలు రెండు : ఒకటి నాటకీయతకలిగిన సంఘటనలేమీ వాళ్ళజీవితాల్లో జరగవుఅని - రెండోది పద్యనాటకాలకు అలవాటు

పడిన ప్రజకు సాంఘిక నాటకాలు రుచించక పోవడం - అంటే రచయితకు, ప్రేక్షకులకూ అభి రుచిలో ఏర్పడిన వైవిధ్యం

ఇప్పుడిప్పుడూ రచయితలు జీవిత ఘట్టాలను నాటకీకరించడానికిచేసే ప్రయత్నాల్లో - కేవలం నాటక రచనలోనేకాక, రంగస్థలంమీదకూడా - విజయం సాధిస్తున్నారు. అటువంటిసాధన శ్రీ అవసరాల సూర్యారావుగారి పంజరంలో ఉత్తమ దశలో కనిపిస్తోంది.

ప్రజలను మోసంచేసి, డబ్బుగడించే శ్రీరామ్ దెబ్బలుతిని, ఆసుపత్రిలోచేరి, భర్తచేత పరాభవింప బడి అక్కడ అజ్ఞాతంగా నర్సువృత్తిలోవున్న జ్యోతి అనే అమ్మాయిదగ్గర ప్రేమ అభినయించి, ఆమెతోసహా ఒకవూళ్ళో కాపురంపెట్టి మెంటల్ డాక్టరుగా, ప్రభుత్వంలో పలుకుబడిదారుగా వియన్నా ఎమ్. ఓ. గా చెలామణి అవుతూ వుంటాడు. ఈసంగతి తెలిసిన ఆ అమ్మాయి భర్త మోహన్, పోలీసు ఇన్స్పెక్టరు శ్రీశ్రీనివాసరావు సహాయంతో పిచ్చివాడివేషంతో రోగిగా చికిత్స పొందడానికి అతని ఇంటికివస్తాడు. డాక్టరు ఆదర్శ వాదిఅని భ్రమపడ్డ జ్యోతి అతని అసలురూపం పసిగట్టి, గట్టిగా చివాట్లుపెట్టి, పెట్టెబేడా సర్దుకొని ఎక్కడికో ప్రయాణం కడుతుంది. తన నిజ రూపంలో పోలీసు ఇన్స్పెక్టరు సమాజాన్ని మోసంచేసినందుకుగాను డాక్టరును అరెస్టుచేస్తాడు. తనుచేసిన తప్పుకు సమాజాన్ని నాలుగు తిట్టి ఇన్స్పెక్టరుతోసహా కారాగారానికి నడుస్తాడు డాక్టర్. ఇదీ కథ.

నాటకరంగంలో నేడు వున్న గుణాగుణాలన్నీ ఈనాటకంలో స్పష్టంగా ప్రతిబింబిస్తున్నవి. తెలుగు నాటక రచయితలోపం ఎక్కడో, తెలుగునాటకం పెరగకపోవడానికి కారణంఏమిటోకూడా దీనివల్ల విశదమౌతున్నది.

నాటకీయత, పాత్రపోషణ, కథాకథనం చక్కగా సాగాయి నాటకంలో. మంచి బిగివున్న సంఘటన కావడంవల్ల ప్రేక్షకుల హృదయాలను ఇట్టే ఆకట్టుకుంటుంది కూడాను.

కథా కథనంద్వారా పాత్రలను విశిష్టంగా పోషించగలిగారు రచయిత. ప్రతి చిన్న పాత్ర కూడా సజీవంగా నడిచింది. ముఖ్యంగా దత్తాత్రే యుడు, జ్యోతి పాత్రలు నాటకానికి ప్రాణం పోశాయి. దత్తాత్రేయుడు ఒక స్కూలు అసిస్టెంటు. హెడ్మాస్టరు రిటైరు కావడంవల్ల, సీనియరు అయిన తనకే ఆ పదవి రావాలని, అందుకు మిగి లినవాళ్ళు అడ్డుపుల్లలు వెయ్యడంతో డాక్టరు సహాయంతో ఎదుటివాళ్ళను నాశనం చెయ్యాలని ఉద్దేశపడ్డాడు. మామూలు మనిషికి ఉండే కోప తాపాలు, అందితే జుట్టుపట్టుకోవడం, అందకపోతే కాళ్ళు పట్టుకోవడం, అనుకున్న మాటను అమాయి కంగా బయటపెట్టేయడం - అతని లక్షణాలు. తెలుగు నాటకరంగంమీద వ్యక్తిత్వం నిలబెట్టుకొనే కొద్ది పాత్రలలోను దత్తాత్రేయుని పాత్ర ఒకటి.

కథను నడపడంలోను, సంభాషణాచాతుర్యం లోను సూర్యారావుగారి ఆధిక్యం ఈ నాటకంవల్ల విస్పష్టం అవుతోంది.

అయితే, ఈ మంచినంతనూ చీకటిలోకి నెట్టి వేసే విషయాలుకూడా ఇందులో కొన్ని ఉన్నాయి. ఇవి అన్నీ ప్రేక్షకులనుంచి నాటక రచయితలకు సంక్రమించిన లక్షణాలు. అందులో ముఖ్యమైనది సంఘాన్ని తిట్టడం, ఈ రోజుల్లో అదో 'ఫాషన్' అయిపోయింది. గత శతాబ్దంగా వెలువడ్డ సాంఘిక నాటకాలలో సంఘాన్ని గురించి వచ్చిన విమర్శలే ఈ నాటకంలో కూడా ప్రతిధ్వనిస్తున్నాయి. చివ రకు సంఘాన్ని ఇంతగానూ మోసంచేసిన డాక్టరు కూడా పోలీసులు పట్టుకోవడానికి రాగానే సంఘం మీద పెద్దగా విరుచుకుపడతాడు. చివరకు ఎవరు వినడానికి సిద్ధంగా ఉంటే వారికల్లా సంఘంమీద విమర్శలను వినిపించడమే పనిగా పెట్టుకోవడం వల్ల రచన కుంటుపడిపోయింది. సమాజాన్ని తిట్టి నప్పుడల్లా ప్రేక్షకులు చప్పట్లు కొడుతున్నారు.

మరి నాటకం విజయవంతం అయిందనడానికి మనకు గీటురాయి అదేకదా! అందువల్ల రచయితలు ఈ నాటురకం చిట్కాలను వాడి మంచి నాటకాలకు కూడా మచ్చను కలిగించే ప్రయత్నం మంచిదికాదు.

నేటి నాటకాలను మెలోడ్రమిటిక్‌గా మారుస్తూన్న మరోసాధనం పిస్టల్. నిత్యమూ మనలో వేయికి ఒకరు కూడ పిస్టలు ఉపయోగిస్తారో లేదో తెలియదు. సాంఘికనాటకాల్లో పురుషులు, స్త్రీలు, వృద్ధులు, యువకులు — ఒకరేమిటి? గురితో నిమిత్తంలేకుండా అందరూ ఉపయోగించేవారే! నిజానికి దానిని ఉపయోగించడంవల్ల ప్రేక్షకులలో ఒక రకమైన ఉత్సాహం, స్పందన కలిగే మాట వాస్తవమే కాని, తప్పనిసరిగా నాటకం క్లైమాక్సులో దానినే వాడడం అనవసరమూ, అసందర్భమూ కూడా. రచయిత చేయితిరగక పోవడాన్నే అది సూచిస్తుంది. ఈ నాటకంలో కూడా చివర రంగం చివరలో యథాశక్తి డాక్టరు, పిచ్చివాడు, పోలీసు ఇన్‌స్పెక్టరు సరేసరి అందరూ పిస్తోలుతో మనల్ని ఝుడిపిస్తారు.

ఇక సూర్యారావుగారు నాటకంలో 'విట్' కోసం 'ప్రయత్నం' చేసినట్లు కనిపిస్తుంది. ఆ ప్రయత్నంలో వ్రాయడంవల్లనే కాబోలు డాక్టరు సంభాషణలు చాలా చోట్ల అతిగా ధ్వనిస్తాయి. 11 వ పేజీలో జ్యోతి. జాన్ 'బివేర్ ఆఫ్ డాగ్స్'ను గురించి చేసిన ప్రసంగం కాని, 49 వ పేజీలో వియన్నాలో డాక్టరు తన గొప్పతనాన్ని చెప్పుకొనేవి కాని, 69 పేజీలో జేబుదొంగతనాన్ని గురించిన సంభాషణ కాని అనవసరమైన ప్రదేశంలో వాడడంచేత అసందర్భంగా కనిపిస్తాయే కాని 'విట్' లుగా తోచవు.

నిజానికి ఈ లోపాలు ప్రేక్షకులకు నచ్చే సన్నివేశాలు, భావాలు తమ నాటకాల్లో ప్రతిబింబింప చేయాలన్న రచయితల కాంక్షవల్ల జనించినవి.

అల్పమైన ఎఫెక్టుల కోసం తాను క్రిందకు దిగకుండా ఉంటే, సూర్యారావుగారు తెలుగుదేశం నేడు కోరుకొనే ఉత్తమ నాటకకర్తగా రూపొందగలరు.

—నాగభూషణ్.

# స్వప్నే ప్రతీయమానాని | తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

ప్రసవముకన్న మెత్తన ప్రభాతముకన్న నవీనమున్ వసం
త సమయ చూతపల్లవ వితానముకన్న మనోహరంబు సా
రసదళ సౌకుమార్య రుచిరత్వము మించిన సౌకుమార్య మీ
మసరిన భావసంచయ మమోఘము నన్నును మోహపెట్టెడిన్.

అతిశయితామృతాంశురుచిరాకృతి యొక్కటి నిద్రలేపి, న
న్నతిమృదు లాతిమంజులరవాంచిత ముగ్ధ మనోజ్ఞభావ గుం
ఫితగతి పల్కరించె ననిపించెనునా కలలోన రాత్రి- ని
శ్చితముగ స్వప్నమంచును వచింపగ రా దిపుడున్ స్వనించెడున్.

ఆ మధురస్వరం బమృతమై దిశలంచులు తాకినట్లుగా
నై మహితానుభూతి యొకదాత్మకు సన్నిహితంబుగా చనెన్
ఈ మరునాటి ప్రొద్దున గతించిన రాతిరి స్వప్న మిట్లు శో
భా మధుపూర్ణమై తిరిగి వచ్చినదిన్ మధుకుల్యపాయలై.

ఓసి విశాలనేత్ర యుగళోజ్జ్వల నూతనకాంతిపాత సం
త్రాస మనోహరాకృతి! వృథాకృత శారదకాల చంద్రరే
ఖా! సుకుమారి! చారుతరకైశిక! నీ హసితాననాంబుజ
శ్రీ సవరించు నాయెద గరిష్ఠతలో నెదియో గరీయసిన్.

నాయెద పుల్కరించి పరిణామము కన్నది నూత్నమైన దే
దో యొక మాధురీ గుణము యుష్మదనూన విముగ్ధరేఖ నా
కాయమునందు గాలితరగల్ గిలకించెనుగాక-మాన్మథ
శ్రీయతి నాహృదంబుసరసీజపు కేసరముల్ గగుర్పగన్.

తెలియదు మాన్మథీయమగు దీవెన నేను ధరించు రూక్షవ
ల్కలములయందు నుండెననిగాని, సుధాస్ఫురణా విలాస చం
చలములు నీదృగంగములు నైజముగా రసకంధులంచు న
గ్గలముగ మేరుపర్వత మకారణ వైఖరి వ్రాలె నా దెసన్.

మానవతీ కరచామర
మానితమందానిలములు మలయజ గంధ
ప్రాణములై నా దేహము
పై నూత్న మహానుభవము ప్రాకాడినదిన్.

ఈ విపరీత స్వప్నసుఖ మెట్టిదటంచు వచింపవచ్చు నా
నావిధ జ్ఞానమార్గ పరిణామ కథాకలనం బొకండు ధా
రావహిత ప్రథలా వళదలై యనుభూతిగ మారె; స్వప్నముల్
ప్రోవులు ప్రోవులై కనులముందర నిల్చు రసస్రవంతులై.

పురుషులకున్ లతాంగులకు పూర్వమునుండి విభిన్నతా పరం
పరలు సమైక్యభావమయి భాసిలునట్లు జగత్తు చూపెడిన్
పురుషుల నే నొకండ పువుబోడులలోపల స్వప్నకన్యకా
వరమణి-మాకు మాకు కలుపంబడిన ట్లనిపించు నైక్యముల్.

పోయిన స్వప్నమందు పువుబోడి హృదంతరముల్ పునఃపునా
మాయలతో బిగించికొని మన్మథదత్త మహాశ్శరీరమై-
ఈయెలనాగ నన్నును జయించిన యట్లుగ భ్రాంతికల్గు-మో
హాయతనంబు దేహమిది యంతయు భ్రాంతుల కాటపట్టువుల్.

కల్పాంత సమయ శంకర ఫాలనేత్రద్యుతులలో పునస్సృష్టి నిలచినట్లు
'ఆహూత తక్షకస్వాహా' సమయ హుతాశనునిలో శాంతరసంబు వోలె
సంగీతమాధుర్య సామవేదంబున-అస్పృశ్య భావంబు లంటినట్లు
బ్రహ్మవిద్యా పరంపరలలో నైగమ ప్రాతికూల్యంబు దార్శనిక మట్లు
క్షణికమైన జీవితమున స్వప్న మొకటి
స్వప్నమందు మాధుర్య రసానుభవము
తద్రసానుభూతికి శాశ్వతత్వ భ్రాంతి
తన్మహాభ్రాంతి విజ్ఞాన దర్పణంబు.

# అభిజ్ఞాన శాకుంతలము 10 | విశ్వనాథ సత్యనారాయణ

(గతసంచిక తరువాయి)

ఈ అంకము యొక్క పరాకాష్ఠ 'మయ్యేవ విస్మరణదారుణ చిత్తవృత్తౌ వృత్తం రహః ప్రణయమప్రతిపద్యమానే కోపాద్భ్రువోః కుటిలయోః అతిలోహితాక్ష్యాః భగ్నం శరాసనమివాతిరుషా స్మరస్య' ఈ శ్లోకములో నున్నది.

ఇంతవరకు రాజు తనకు తెలియకుండ తన యంతఃకరణ ప్రవృత్తి లక్షణమైనవియు, సహజముగా శకుంతలయందు తనకుగల యనురాగము తనకు తెలియకుండ జేయునవియునైన వాక్యముల తోడనే మాటాడెను. ఈ శ్లోకార్థము వానికంటె భిన్నమైనది. దీని తాత్పర్య మిది: విస్మయదారుణ చిత్తవృత్తినైన నేను రహః ప్రణయ వృత్తమును తెలిసికొనలేక యుండగా అతిలోహితాక్షియైన యీమె యొక్క వంకరలైన కనుబొమల యొక్క భేదము చేత మిక్కిలి కోపము కలిగిన మన్మథునియొక్క ధనుస్సు భగ్నమైనదా యన్నట్లుండెను. ఇది దీని యర్థము. శ్లోకమునందలి పూర్వార్ధమున 'విస్మరణ దారుణ చిత్తవృత్తినై నేను ఈ రహః ప్రణయ వృత్తమును తెలిసికొనలేక యుండగా' నన్న విషయమే చమత్కారముగా నున్నది. 'నేను విస్మరణ దారుణ చిత్తవృత్తిని. అందుచేత నాకు జ్ఞాపకము వచ్చుటలేదు' అను నర్థ మిందులో నున్నదిగదా! అనగా నేను మరచిపోయితిని అని యర్థము. మరచిపోయినవాడు తానా విషయమును మరచిపోయితి ననుట యెట్లు? ఇది పొసగుటలేదు. కాదా? ఇక్కడ ప్రయోగించిన సతిసప్తమికి నింత యర్థము వచ్చునా యని ప్రశ్న. ఈ వాక్య మిట్లుండునా? ఈమె కోపమును చూచినచో నిజముగా నీ రహః ప్రణయమును నేను మరచిపోయితినేమో అన్నట్లున్నది అన్న వాక్య మధిక సమంజసము. ఇట్టి వాక్యముచేత నామెయొక్క కోపప్రకటనము నందలి యాథార్థ్యము వ్యంజ్యమానమగును. మరి ప్రస్తుతమున్న వాక్యమున కర్థమేమి? ఎట్లును పొసగునట్లు కన్పించదు. అప్పుడు సతిసప్తమికి విశేషార్థము చెప్పవలసి యుండును. సామాన్యముగా సంస్కృత భాషలో సతి సప్తమిని తత్పూర్వమునందు గతించిన విషయమును చెప్పుటయం దుపయోగించుట గలదు. కార్యకారణములందు కారణము సతి సప్తమియందు చెప్పవచ్చును. అదియట్లు జరుగుచుండగా నిదియిట్లు జరిగినదని యను నర్థమునందే దీనియొక్క బాహుళ్య ప్రయోగము కలదు. ఇచ్చట నట్లు కాదే. ఇచ్చటకూడ పూర్వమువలెనే యితని యంతఃకరణాభిజ్ఞానము వేరు, మనస్సుయొక్క యాదేశము వేరు. దాని యభిజ్ఞ వేరుగా విస్పష్టముగా భాసించుచున్నది. సామాన్యమైన వాక్యోపన్యాస వైఖరి ఇట్లుండనేకూడదు. దీనివలన తాను తద్రహః ప్రణయముసు విస్మరించితినని తా నొప్పుకొనుచున్నాడు. కాని పాఠకుని శ్రోతను మరియొక విధముగా నీ పద్యార్థమును భావింపుడని చెప్పినట్లున్నది. పరంపరగా గ్రంథము చదువుకొని వచ్చుచు కథాంశములు విస్పష్టములైనవిగా కనిపించుటచేత పాఠకులు తత్సందర్భోచితమైన యర్థమునే చూతురు. అచ్చటనున్న వాక్యమున కెంత యర్థమని విచారించరు. అక్కడనున్న వాక్యార్థము వేరు. కథాసందర్భమునుబట్టి పాఠకుడు భావించెడి యర్థము వేరు. దీనిని కావ్యదోషములందు నేయార్థమని చెప్పుదురు ఆ నేయార్థము మహాకవుల విషయములో జరుగదు. ఇక్కడ జరుగుచున్నది. ఇది కాళిదాసుని

దోషముకాదు. బహు సంఖ్యగల పాఠకుల దోషము. ఈ పద్యముయొక్క యర్థము యథార్థముగా చెప్పి కొనినచో ఈ విమర్శ మొదటినుండియు మరియు నీ పంచమాంకముయొక్క మొదటినుండి ద్విధా భూతమై యంతఃకరణ ప్రతిపాదనశీలమును విస్మృతి పాత్రమైన మనోలక్షణమును భాసింపజేయుచునే యున్నది. ఆ దృష్టితో చూచినచో ఈ శ్లోకమునందలి కాళిదాసుయొక్క శిల్పము, పద్యరచనాగతశిల్పము, పరమనిగూఢార్థ ఘటనాసామర్థ్యము వ్యక్తమగును. ఇది సర్వధా మహాకవుల లక్షణము. వారు సామాన్యముగా కథాగమనానుబంధిగా లోకగతాభిప్రాయానుసారముగా పద్యమునందలి భావమును పెట్టినట్లు కనిపింపచేసి గాఢముగా నాలోచించువానికి దాని వెనుకనున్న యేదో పరమరహస్యమును గర్భితవృత్తితో ననుసంధింతురు. మరియు నీ యర్థమునే శ్లోకముయొక్క యుత్తరార్థమునందలి యుత్ప్రేక్షచేత మరల సాధించుచున్నాడు. ఆమెయొక్క భ్రూభంగ మెట్లున్నది? మిక్కిలి కోపముచేత మన్మథుని యొక్క ధనుస్సు భగ్నమైనదా యన్నట్లున్నది. భగ్నమైనదా? భగ్నమైనదా యన్నట్లున్నదా? ఈ రెంటికిని భేదమున్నది. భగ్నమైనదన్నచో ఇంకేమి యున్నది? కథయే పోయినది. మన్మథుని యొక్క ధనుస్సు భగ్నమైనదనగా నితడు భర్తకాడు. ఆమె భార్యగాదు. శృంగారరసపార విచ్ఛిన్నమైనది. రసభంగమైనది. కథావిచ్ఛిత్తి జరిగినది. కాని యిచ్చటి యుత్ప్రేక్షాలంకారవశమున నా విచ్ఛిత్తి జరుగలేదు స్థూలబుద్ధికి విచ్ఛిత్తి జరిగినదనిపించవచ్చును. సూక్ష్మబుద్ధికి జరుగలేదు. రస సాంతత్య పరమాభిజ్ఞతా లక్షణము సూక్ష్మబుద్ధికి సంబంధించిన విషయము. ఉత్ప్రేక్షాలంకార మెట్టిది? అన్యమైనదానియొక్క ధర్మము నన్యమైనదాని ధర్మము నందారోపించుట వస్తువులకు సాదృశ్యముకాదు. వస్తు ధర్మములయందు సాదృశ్యము. అతిలోహితాక్షియైన శకుంతలయొక్క కుటిలభ్రువునకును కోపించినటువంటి మన్మథునియొక్క ధనుస్సునకుగల సాదృశ్యము కాదిచ్చట జెప్పినది. ఆ భ్రువులయొక్క భేదమునకు ధనుస్సుయొక్క భంగమునకు సాదృశ్యము. ఇది మాత్రమిచ్చట సరిపోవునా యని విచారింపదగి యున్నది. స్మరునియొక్క శరాసనము విరువబడినదా యన్నట్లున్నది? ఎవరిచేత? ఎవరిచేతను లేదు. ఎవరిచేతనైననైనచో నది శకుంతలచేత. మన్మథుని యొక్క ధనుస్సును విరిచినది శకుంతల కావలయును. అతికోపముచేత నామెయే విరిచినదా యన్నట్లున్నది. తాత్పర్యతః శకుంతల రాజునందున్న వలపును తుడిచి వేసినది. అతనియందలి భర్తృభావమును వదలి పెట్టినది. అతనియందున్న తన శృంగార వాంఛకు స్వస్తి చెప్పినది అని యర్థము రావలయును. అప్పుడును రసవిచ్ఛిత్తియే అప్పుడును కథాభంగమే.

కాని ఆమె ప్రకటించిన కోపము మన్మథుని ధనుస్సును విరిచినదా యన్నట్లున్నది కాని నిజముగా విరువలేదు.

ఈశ్లోక పూర్వార్ధమునందు రాజుయొక్క యంతఃకరణ మనోవృత్తులయొక్క యేకత్రస్థితి జోడింపబడి యెట్లు రసవిచ్ఛిత్తి కాలేదో యుత్తరార్ధమునందలి యామె కోపభ్రూభంగలక్షణము వర్ణించుటయందు కూడ నామెయందు సైతము రసవిచ్ఛిత్తి కలుగలేదు. ఆమెకు వచ్చిన కోప మెటువంటిదనగా భర్త తన్ను నిరాకరింపగా వానియందలి వలపు కలిగి వాని దుష్టత్వముచేత కోపించిన స్త్రీయొక్క లక్షణముగాని ఛీ వీనితో నాకేమిపని? వీనిని నేను పరిత్యజించితిని అన్నట్టి లక్షణముగాదు. ఇచ్చట యుత్ప్రేక్షాలంకారమునందీ యర్థమంతయు ఇమిడియున్నది. ఈ యొక్క శ్లోకముచేత కాళిదాసు పంచమాంకగత కథాస్రోతస్సుయొక్క మహోచ్ఛ్రదశ నిరూపించి తన్నిరూపణయందు దుష్యంతుని యంతఃకరణము మేల్కొని యున్నదని నిరూపణ చేయుటచేతను, శకుంతలకు మిక్కిలికోపము వచ్చెనుగాని వానియందు భర్తృభావమును త్యజించలేదనుటచేతను పరమవిచిత్రముగా రసభంగము కానీయకుండ కథాభంగము కానీయకుండ రక్షించెను. పోషించెను.

ఇంతకోపము శకుంతలకు కలుగుట కేమి కారణము ? అంకాదినుండి యామెను తానెరుగనన్నట్లే దుష్యంతుడు ప్రవర్తించుచుండెనుగదా ? నీవు నన్ను పెండ్లియాడితివనగా శాంతం పాపమన్నాడు గదా! అభిజ్ఞానము చూపింతుననగా ఆ ఆమాట బాగున్నదని యధిక్షేపించినాడుగదా! శ్రోతవ్యమిదానీం సంవృత్తమ్ అనికూడ వెక్కిరించినాడు. శృణ్వస్తావత్ అన్న దానిలో కూడ వెక్కిరింపే యున్నది. ఇన్నింటి కూరకుంది శకుంతల చివరకు ఈమాటలన్నది. 'అనార్య! ఆత్మనో హృదయానుమానేన సర్వం పశ్యసి! క ఇదానీం, అన్యః ధర్మకంచుక ప్రవేశినః తృణచ్ఛన్న కూపోపమస్య తవానుకృతిం పశ్యతి!' 'అనార్యుడా! నీయొక్క హృదయమునందలి అనుమానముచేతనే అంతయు చూచుచున్నావు. ధర్మమను చొక్కాయందు దూరినటువంటి, గడ్డిచేత కప్పబడిన నూతితో సాటువ కలిగినటువంటి నీయొక్క అనుకృతిని ఇప్పుడెవడు అన్యుడు చూచుచున్నాడు ? సరిగా నీమాటకర్థము తాత్పర్యముగా నీవు ధర్మకంచుక ప్రవేశివి. తృణచ్ఛన్న కూపోపముడవు అన్న మాటలతో శకుంతల దుష్యంతు నూటాడె ననుపించునేగాని జాగ్రత్తగా చూచినచో నచ్చటికర్త 'అన్యః' క్రియ 'పశ్యతి' కర్మ 'అనుకృతి'. ఎవడు నీయొక్క యనుకృతిని చూచుచున్నాడని యర్థము. అతని యనుకృతిని చూచుట యేమిటి ? ఇచ్చట ననుకృతి యనగా నిజముగా ధర్మియైన వాడొక డున్నాడు. ఉన్నచో వానిని దుష్యంతు డనుకరించుచున్నాడు. అందుచేత దుష్యంతుడు ధర్మకంచుక ప్రవేశిగాని ధర్మికాడు. నీ యనుకృతిని యెవ డిక్కడ చూచుచున్నాడు. అనగా నీవు చేసెడి యీ యన్యాయమును తెలిసినవా డిచ్చటలేడు అని యర్థము కావచ్చును. నాకే తెలియును నీకు కూడ తెలియునని యర్థము. నీకు కూడ తెలియు ననగా శకుంతల నిస్సంశయముగా దుష్యంతునియొక్క యాథార్థ్యమును శంకించెను. అతడు తెలిసియే దాచుచున్నాడని యామె గట్టిగా నమ్మెను. అందుచేత నామెకంత కోపమువచ్చినది.

ఎందుకు శకుంతల అట్లనుకొనినది ? ఎందుకనగా రాజు గౌతమితో 'అయి తాపస వృద్ధే' స్త్రీణా మశిక్షితపటుత్వ మమానుషీషు సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః, ప్రాగంతరిక్షగమనాత్ స్వమపత్య జాతం అన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి' ఈమాటలన్నాడు. ఎవరితో నన్నాడు. శకుంతలతో కాదు. గౌతమితో. ముందర యీ శ్లోకార్థమును విచారించి గౌతమితో ననుటలోని గడుసుదనమును విచారింతము. స్త్రీల యొక్క అశిక్షిత పటుత్వము అమానుషుల యందుకూడ కనుపించుచున్నది. ఎవరు ప్రతిబోధవతులో వారి విషయము చెప్పవలెనా ? అంతరిక్షగమనమునకు పూర్వము పరభృతలు తమ ఆపత్యజాతమునకు అన్యద్విజ పోషణము కలిగించుచున్నవి. ఇది లోకమునందు కనిపించుచున్నది. ఇది సామాన్యార్థము. ఇందులో నేదియో యొక ప్రత్యేకార్థము శకుంతలకంత కోపము దెప్పించి యుండవలయును. ఆ యర్థమేమిటి ? 'అమానుషీషు' అనగా కోకిలను చెప్పకొని తిర్యగ్జంతువుల యందు అని యర్థము చెప్పకొనుచున్నాము. అమానుషి యనగా అప్సరస్త్రీ యెందుకు కాకూడదు ? అగుచున్నది. మానవ స్త్రీలు ప్రతిబోధవతులు అనగా యాలోచన చేతనో శిక్ష చేతనో తెలిసికొనెడివారు. దేవతలో పుట్టిపెరుగుట లేదు పెరిగి పుట్టుచున్నారు. వారెప్పుడును పుప్పడి యేండ్లవారే. భోగముకొరకు జన్మయెత్తిరి. సహజముగానే వారియందు భోగలక్షణము కలదు. దాని పేరే అశిక్షితపటుత్వము- అంతరిక్షగమనమునకు పూర్వము ననగా మేనక శకుంతలను వదలిపెట్టి తనదారిని తానాకాశమున బడిపోకపూర్వము. 'పరభృతాః' చప్పున కోకిలలని మనకర్థము. శకుంతలకో తన తల్లియు తల్లివంటివారును. వారింద్రభృతలు. తమమీద తమకధికారములేదు. ఋషుల తపస్సు భంగించుటకు దేవేంద్రుడు పంపెనుగాని కన్న బిడ్డలను స్వర్గమునకు తీసికొనిరమ్మనిగాదు. అందుచేత నీ పరభృతయైన మేనకగాని ఋషులచేత సంతానము

కన్న యితర అప్సరస స్త్రీలుగాని యేమిచేయు చున్నారు ? తామొక ద్విజునియందీ సంతానముకని- విశ్వామిత్రాదులయందు- ఇతర ద్విజులచేత- కణ్వాదులచేత- పోషింపజేయుచున్నారు. ఈ యర్థము శకుంతల మనస్సుకు తగులుట చాల సహజమైన విషయము. ఎవరు బాధపడుచుందురో ఆ బాధ ఎవరివలన పడుచుందురో వారి మాటలలోని గూఢార్థములు ఆబాధ పడుచున్నవారికి తెలిసినంతగా పుస్తకములు చదువువారికి తెలియదు.

ఇప్పుడు రాజు గడుసుదనము చూడవలయును. అతడీ మాటలు ముఖాముఖిగా శకుంతలతో చెప్పినచో ఆమాటలలోని చురుకుదన మంతయుండదు. ప్రక్కవారితో చెప్పునప్పటికి నఖశిఖాపర్యంతము మండిపోవును. ఇది కాళిదాసుని గడుసుదనము. పాపము ! శకుంతల నిజముగా నమ్మినది. నిజముగా దుష్యంతు డబద్ధమాడుచున్నాడు. తెలిసి తన్ను వంచించుచున్నాడు. అందుకని యామెకంత కోపము వచ్చినది. కాని దుష్యంతుడు నిజముగా మరచిపోయినాడు. ఆమెకోపముచేత తత్పరిగ్రహ విషయమును స్మరించలేదు. కాని యతని మనస్సునకు సహజమైన పరిశీలనాదక్షతచేత నామెయొక్క యాథార్థ్యమునందు విశ్వాసము కలవాడైనాడు. తరువాత శకుంతలను శార్ఙ్గరవుడు కోపించుట, తన్నుతిట్టుట మొదలైనవన్నియు జరిగినవి. చివరకు శార్ఙ్గరవుడు 'పూర్వవృత్త మన్యాసంగాత్ విస్మృతో భవాన్ తత్కథ మధర్మభీరుః' అన్నాడు. ఇతర స్త్రీ సంగమమువలన పూర్వ వృత్తమును మరచిపోయితివి. నీవు ధర్మభీరుడ వెట్లగుదువు?' అన్న శార్ఙ్గరవుని మాటలలో రాజు మరచిపోయినాడని యున్నది. నిస్సంశయముగా నున్నది. పాపము శార్ఙ్గరవుడు రాజు మరచిపోయినాడని విశ్వసించెను కాని యతడు మరచిపోవుటకు కారణము మాత్రము లోక సామాన్యముగా నందరు నూహించునట్లే యూహించినాడు. ఈమాట శార్ఙ్గరవుడనునంతకు రాజునకు మరికొంత మెలకువ వచ్చినది. అప్పుడు పురోహితునితో 'మూఢ స్యా మహ మేషావా వదే న్మిథ్యేతి సంశయే దారత్యాగీ భవా మ్యాహో పరస్త్రీ స్పర్శపాంసులః' 'నేను మూఢుడనగుచున్నానా ? ఆమె యబద్ధమాడుచున్నదా ?' అని నేను సంశయ పడుచున్నాను అని చెప్పినాడు. దీనికి కారణము శార్ఙ్గరవుడు నీవు మరచిపోతివని గట్టిగా చెప్పుట.

ఈ యంకమంతయు నిట్లేయైనది. కథావిచ్ఛిత్తి జరుగలేదు. రసభంగము జరుగలేదు. అయినను ఆ మహాకవికి భయమే. ఈ అంకమునందలి చివరి శ్లోకము 'కామం ప్రత్యాదిష్టా స్మరామి న పరిగ్రహం మునే స్తనయాం, బలవత్తు దూయమానం ప్రత్యాయయతీవ మే హృదయం' ఆమెను కాదన్నాను. ఆమెను భార్యయని నేను స్మరించలేకున్నాను. కాని నాగుండె బాధపడుచున్నది. ఈ బాధ నన్ను నమ్మించుచున్నదా యన్నట్లున్నది. ఈ శ్లోకార్థముచేత గూడ పూర్వమే విషయమును కాళిదాసు స్థాపించెనో దానినే స్థాపించుచున్నాడు. అంతఃకరణ మనస్సులయొక్క సహస్థితిని నిరూపించుచున్నాడు. కొంచెము వెనుకకు పోయినచో ప్రథమాంకము చివర గజమును వర్ణించుచు 'తీవ్రాఘాత ప్రతిహత తరుస్కంధ లగ్నైకదంతః' మొదలైన శ్లోకమునకు వ్రాసిన వ్యాఖ్యానము చూచినచో నిచ్చట సమన్వయ పరచుకొనవచ్చును. పాదాకృష్ట యన్న శబ్దములో పాదమనగా నంతఃకరణ చతుర్థభాగమని చెప్పబడినదిగదా ! అంతఃకరణ చతుర్థభాగము మనస్సు. ఆ మనస్సేమన్నది ? 'స్మరామి నపరిగ్రహం మునే స్తనయాం' అన్నది. అంతఃకరణమైనటువంటి హృదయమేమి చేయుచున్నది ? ప్రత్యాయయతి నమ్మించుచున్నది.

# ఆమెకు తెలియని రహస్యం | మంజుశ్రీ

"ఏమండీ ప్ర .. ప్రకాశరావుగారూ, బా....బావున్నారా" ఎదురుగా నిలబడి సరస్వతి అడుగుతోంది.

ప్రకాశరావుకి భూమిలో కూరుకపోతున్నట్లనిపించింది, ఒక్కసారిగా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఎన్నడూ కలుగనంత అసహ్యం వొక్కసారిగా తనమీదే తనకు కలిగింది.

సరస్వతి నవ్వుతోంది. సమస్యలులేని యీడున ఒక్క పువ్వు పూసినట్లుంది....యవ్వనానికి గర్వం....రెండు జడల్లోనూ ఒక్క దాంట్లోనే ఒక్క సంపంగి. ఒక్కచేతికే గాజులు - ప్రకాశరావుకి గుర్తురాలేదు, తననంత చనువుగా పలకరించిన తర్వాత యెవరో చెవిలో చెప్పినట్లయింది, సరస్వతి, సరస్వతి,

ప్రిన్సిపాల్‌గారు నవ్వుతున్నారు.

"నేనండీ....సరస్వతిని... "

"గు....గుర్తులేకేం, మ....మ ...మరిచిపోలేదు."

"సరే చూస్తానులేవోయ్" అన్నారు ప్రిన్సిపాలుగారు.

కృతజ్ఞతతో తలవంగిపోగా నమస్కరించి బయటికి వచ్చేశాడు ప్రకాశరావు, క్లాసులోకి వెళ్ళేముందు స్తంభం చాటున నిలుచుని కళ్ళు తుడుచుకున్నాడు. •క్లాసులో చెపుతున్నది ఒక్క ముక్క అర్థం కాలేదు. అర్థం కావటంలేదు.

మనస్సంతా అమ్మవైపు మళ్ళుతున్నది, అమ్మ లేకపోతే తాను సుఖంగా కృష్ణలోపడిచచ్చిపోవును. రోజూ పేపర్లో చూస్తుంటాడు, దేశంలో ఇన్ని రైళ్ళు పడిపోతున్నాయి. ఇన్ని బస్సులు తల్లక్రిందులవుతున్నాయి నట్టనడివీధిన చిన్నిపిల్లల మీదుగా లారీలు పోతున్నాయి. ఎంతోమంది కుఱ్ఱవాళ్ళు చదువుకునే యీడున్నే చచ్చిపోతున్నారు.

తాను ప్రయాణంచేస్తున్న రైలు యెప్పుడూ కూలలేదు. బస్సు యెప్పుడూ బోల్తా పడలేదు, పరధ్యానంగా నడుస్తున్నా రిక్షాకూడా తనకు 'డాష్' ఇవ్వలేదు. తనకు యెన్నడూ జ్వరంకూడా రాలేదు.

ప్రపంచంమీద కసి. ఈ మనుషులందరూ తనని పొడుస్తున్నారు. ఆడపిల్లలు తనసిచూసి నవ్వుతారు. మగపిల్లలకు తాను కాలక్షేపం.

సరస్వతి యెందుకు తననలా అన్నది. ఆమెకేమి అధికారం. తలవంచుకుని నడుస్తున్నా తనని ఆపి, ముఖం యెత్తేట్లుచేసి నవ్వుతారు. ఒంటరిగా యెలా బతకటం. ఒంటరితనం అంటే యేమిటి? సరస్వతి తననలా యెందుకన్నది? ఆమెకేమి సంబంధం, ఆమెదగ్గరకు తాను యాచనకు పోయినాడా! తనని యెత్తి పొడవటానికి

క్లాసులో లెక్చరర్ అటెండెన్సు పిలుస్తున్నాడు, ప్రకాశరావు పలకలేదు. తన పక్కన యేమి జరుగుతున్నదో కూడా తనకు తెలియటంలేదు. ప్రతిరోజూ లెక్చరర్‌గారు తన పేరు పిలిచేవాడుకాదు. చూచి ప్రెజెంట్ మార్కు చేసేవాడు.

తన అటెండెన్స్ పక్కవాడు లేచి పలికాడు.

క్లాసుపిల్లలంతా నవ్వారు. అప్పుడు తెలిసింది ఆ విషయం లెక్చరర్‌గారు కూడా నవ్వారు....ప్రకాశరావు కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి.

ప్రకాశరావు నేరుగా తనగదికి పోయినాడు. వీధిలో నడచివచ్చిన విషయం గుర్తులేదు. తలనొప్పి పుడుతున్నది. చాపమీద నీరసంగా పడుకున్నాడు. మధ్యాహ్నం కాలేజీకి వెళ్ళదలుచుకోలేదు. ప్రకాశరావుకి యేమిటోదిగులుపట్టుకున్నట్టుంది. తన కెందుకింత విచారం.

ఈ మనుషులంతా ప్రాణాలు లేనివాళ్ళలా యెందుకు కనిపిస్తున్నారు? చెట్టుకు పూసినపూలు కాగితపు పూలలా యెందుకు కన్పిస్తున్నాయి? సరస్వతి అలా యెందుకన్నది?

అంతకుముందే ప్రిన్సిపాల్‌గారు అంటున్నారు.

"నువు లైఫ్‌లో యెలా ప్రాస్పరవుతావోయ్."

స్కాలర్‌షిప్ ఇప్పించమని ఆయనతో చెప్పటానికి అరగంట నిలుచోవలసివచ్చె. నోటమాట రాకపోయె. ఎంత ప్రయత్నం చేశాడు చెపుదామని. ఆయన మూడుసార్లు అడిగాడు. ప్రకాశరావుకి కన్నీళ్ళు వచ్చాయి. ఆయనకు నవ్వొచ్చింది. తాను చెప్పకముందే "సరే చూస్తానులేవోయ్" అన్నారు. సరస్వతి అలా యెందుకన్నది! ఒకసారి కావల్యాపురం వెళ్ళవలసి వచ్చింది. చాలా దగ్గర స్నేహితుడికి

జబ్బుగావుంది రమ్మని. రైల్వేస్టేషన్‌కు పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. రైలు కదలబోతున్నది. సరిగ్గా టైముకి చేరుకున్నాడు. బుకింగు కిటికీవద్ద నిలుచున్నాడు. రూపాయినోటు తీసి క్లర్కు చేతికిచ్చాడు.

"ఎక్కడికి సార్..."

నోటమాట రాదే— ఆ.. నోట్లోనే ఆడుతోంది. నాలుక పాములా మెలికలు మెలికలు తిరుగుతున్నది రైలు కూత వేసింది. నోటమాట రావటంలేదు. బుకింగ్‌క్లర్కు విసుగ్గా చూశాడు. ప్రకాశరావుకి భూమిలోకి కూరుకుపోతున్నట్లనిపించింది. రైలు కదిలింది. తనకు ఏ స్టేషన్‌కు టికెట్ కావాలో ఆ స్టేషన్‌పేరు చెప్పలేకనే పోయాడు. బుకింగ్ క్లర్కు నవ్వుతున్నాడు. కౌంటర్‌లోంచి రూపాయినోటు బయటికి వచ్చింది. రైలు అరుచుకుంటూ వెళ్ళిపోయింది. మళ్ళీ అరుగంటలదాకా రైలు లేదు. సాయంకాలం ఆరుగంటలు. బుకింగ్‌క్లర్కు చూడటానికి వీలులేనంత దూరం పోయి ప్రకాశరావు యేడ్చాడు. నిజంగా యేడుపు వచ్చింది. ఈ ప్రపంచంలో తా నెలా బ్రతకటం. అన్నీ కాగితంమీద వ్రాసిపెట్టుకోవాలా. భగవంతుడు తననెందు కిలా చేశాడు. సాయంకాలం ఆరుగ్గంటల రైలుకి చిన్న చీటిమీద స్టేషన్ పేరు రాసి టికెట్ తీసుకున్నాడు.

ఒకసారి రాత్రిపూట, చల్లని రాత్రిపూట. బావిచప్టామీద చందమామ వెన్నెలముగ్గులు పెడుతున్న సమయంలో, ఆకాశంలో చిన్నచిన్న మబ్బులు కదలాడుతున్నవేళ, కొబ్బరిచెట్టు ఆకులు సంతోషపడుతున్న వేళ, పొట్లపాదు మీదినుంచి మంచివాసనలు వస్తున్న సమయంలో, అమ్మమనస్సు పట్టలేక, మనసుపట్టని ఆనందంలో– అవాళే పరీక్షలో ఫస్టున ప్యాసైనట్లు తెలిసింది— అన్నంలో పెరుగువడ్డిస్తూ-

"రేపు తలుపుదగ్గర పెళ్ళాం పేరెలా చెపుతావురానాయనా" అన్నది.

ప్రకాశరావుకి అన్నం సయించలేదు.

అమ్మచూడకుండా కన్నీళ్ళు తుడుచుకున్నాడు.

ఎన్నోసార్లు రైళ్ళలో, కార్లలో తన మానాన తాను తల వంచుకుని కూచుంటే "పేరేమిటండీ...ఏం చదువుతున్నారు... ఉద్యోగమా.... పిల్లలా.... పెండ్లికాలేదూ.... మీ గోత్రమేమిటి ?" మొదలయిన ప్రశ్నలతో తనని చిన్నబుచ్చారు మనుషులు. వాళ్ళు చిన్నబుచ్చాలని అనుకోకపోయినా తనకలా బాధ కలిగిందా లేదా-

చివరకు తాను యెత్తుకుని, ఆడించి, పెంచింది, అక్కయ్య కూతురు ...పెంచుకున్న మమకారాలు తెంచివేసుకునేట్లు, "మామయ్యను నేను చేసుకోను ..అని చెప్పిందట" మరి యీ ప్రపంచంలో యేం చూసుకుని....అని అవాళ తాను... క్రిందుమీదు కాలేదా-

చిన్నతనంలో మామయ్య అనేవాడు.

"ఈ నత్తివెధవయేడీ..." "ఊ...ఇంకా కొంపకి చేరుకోలేదూ !"

మొదట్లో మొదట్లో అమ్మ - "వాణ్ణి అలాఅనకు అన్నయ్యా. ఇష్టంలేకపోతే వాడికి నీ కూతురి నివ్వవద్దులే. వాడి మానాన వాడు బ్రతుకుతాడు" తరవాత తరవాత ఆమాత్రం మాట్లాడేందుకుకూడా హక్కు నశించిన తర్వాత, అమ్మ రాత్రుళ్ళు యెవరికో చెప్పుకుంటున్నట్లు "పాపిష్టివాళ్ళు, చూడలేక అంటారుకాని, నా నాయనకేం, బంగారుకొండ," అనేది తన వీపు నిమురుతూ. మామయ్యగారింట్లో పిల్లలంతా నత్తిబావా, అని పిలిచేవాళ్ళు తనని.

అమ్మ చిన్నతనాన అన్నట్లుగానే మామయ్య పిల్ల నివ్వలేదు తనకు. ఇంటర్‌మీడియట్ ఫస్టుక్లాసులో ప్యాసైన సంవత్సరం అభిమానంతో, సిగ్గువిడిచి మామయ్యను, అమ్మ అడిగింది, తన కూతుర్ని కోడలుగా చేసుకుంటానని - కాని మామయ్య ఒప్పుకోలేదు.

అందువలన తనకేం కష్టం కలుగలేదు నష్టమూ-

తరువాత అమ్మ, తన అన్నయ్యదగ్గర వుండటానికి ఇష్టపడలేదు ఇంకొక సంవత్సరంలో తన జన్మ చరితార్థ మవుతుంది. అమ్మ ఇక యెవరికో వూడిగం చెయ్యవలసిన అవసరం వుండదు. చదువైపోగానే యెక్కడోక్కడ ఉద్యోగం దొరక్కపోదు. ఏమో - తనకి మాటలు తొందరగారావని ఉద్యోగం ఇస్తారో లేదో - బ్రతుకులో అడుగడుగునా యీ వెలితి క్రుంగతీస్తోంది తనని, పోనీ ముష్టెత్తి అమ్మని బ్రతికించుకుంటాడు. అమ్మ తనదగ్గిరవుంటే తన కంతే చాలును. ఈ ప్రపంచంలో అమ్మవినా తనకేం లేదు. పెండ్లి చేసుకుందామనుకున్న వ్యామోహం లేదు తనకు. ఏ చల్లటివేళనో అలాటికోరిక గుండెల్లో మొలకెత్తినా, ఒక భయం, ఒక దిగులు, ఒక ఆత్మన్యూనతాశంక, ఆ మొలకను నాశనం చేసేవి. పోనీ అమ్మా, తానూ, బ్రతకలేమా-!

ఈ సరస్వతి చాలా రోజులతర్వాత మళ్ళీ తన జీవితంలోకి వచ్చిందేం ఈమెకు తన బ్రతుకుతో ఒక రహస్యమైన సంబంధం వున్నది. తన బ్రతుకులోని యీ వెలితికి కారణం ఆమె.· ఆమెను చాలారోజులై మరిచిపోయినాడు. కాని మళ్ళీ ఇవాళ ఆ అమ్మాయి ప్రత్యక్షమైంది. ఎంత మారిపోయింది. ఆ అందమంతా యెక్కడినుంచి తెచ్చుకుంది. వెలితిలేని మనుష్యులు అంతహాయిగా వుంటారు కాబోలును.

తన వెలితికి కారణం ఆమె అయి, ఎంత తేలిగ్గా వెక్కిరించింది తనను. సరస్వతి యెప్పుడైనా గుర్తువస్తేనే దుఃఖం వస్తుంది తనకు. నీటిఒడ్డున నిలబడి నీళ్ళలోకి నెట్టి, తాను మునుగుతూ, తేలుతూ బాధపడుతుంటే ఒడ్డున నిలుచుని నవ్వుతున్నది. పోనీలే, ఏంచేస్తాడు తను. దురదృష్టాన్ని నిందించుకోవటంకన్న. కన్నీళ్ళు పెట్టుకోవటంకన్న.

పెరుగుతున్నకొద్దీ బాధ లెక్కువవుతవి. ఈ ప్రపంచంలో యేమీలేదని తెలుస్తుంది.

ఎప్పుడూ చిన్నతనంలోలాగే వుంటే ఎంత బావుంటుంది. ఏదేళ్ళు వెళ్ళకుండా వయస్సు అక్కడే నిలిచిపోతే యెంత బావుంటుంది. ఇంతమంది మనుషుల్లోకి రాకుండా—ఇన్ని బాధలు పడకుండా—

ఇంకా ఇంకా వెనక్కు చూచుకుంటే, ఆవాళ జీవితం యెంత బావుండేది. ఆవాళ జీవితాన్ని తలుచుకుంటే ఇవాల్టి బ్రతుకు చేదు పుక్కిలించినట్లుగా వుంటుంది.

అందమైన చిన్న పల్లె. అక్కడి మనుషులు మంచివాళ్లు. అందులో వో వీధిబడి. ఆ వీధిబడిలో ఓ చిన్నపిల్లకూ తనకూ సావాసం. వీధిబడిలో పెద్ద పున్నాగచెట్టు చుట్టూ దడి. దడిచుట్టూ పచ్చగన్నేరు చెట్లు, ఆ చిన్నపిల్ల ఒడినిండా గన్నేరుపూలు నింపేవాడు. తొడిమ తుంపి పెదవులతో పీలిస్తే తియ్యగా వుంటాయి గన్నేరుపూలు. ఒడినిండా పున్నాగపూలు నింపేవాడు. ఒక్కొక్క చిన్నరేకు నోట్లో పెట్టుకుని బుడగలాచేసి, ఆ అమ్మాయి ముఖంమీద బుగ్గలమీద ఆ బుడగను టప్ మనిపించేవాడు. అవునుమరి. పచ్చగన్నేరు పూలు, పున్నాగపూలు, తియ్యని రోజులు.

ఒక్కరోజు చూడకుండా వుండలేక పొయ్యేవాళ్ళు. తాను వాళ్ళింట్లోనో, ఆపిల్ల తన ఇంట్లోనో కాలం గడిపేవాళ్ళు. వాన వచ్చిరోజున. బడిలేనిరోజున, పడవలు చేసుకుని, పారే నీళ్ళలో వదలలేదూ — రహస్యాలు చెప్పుకోలేదూ—నవ్వుకోలేదూ — ఏడిపించుకోలేదూ !

చివరకు నాన్న కంఠజబ్బు చేసినప్పుడు వాళ్ళమ్మ భయం పెట్టినా, తిట్టినా, కొట్టినా ఆ చిన్నపిల్ల తనని చూడటానికి వచ్చేదికదూ - ఆ కళ్ళలో యెంత దిగులు. పదిరోజులనుంచీ బడికి తానొక్కడే పోతున్నదట. తనకి చెప్పింది. దేవుడికి మొక్కుకోమని. దేవుడికి మొక్కుకుంటే నాన్న జబ్బు నయమవుతుందని. తాను మొక్కుకున్నాడుకదూ. ఆ చిన్నపిల్ల పక్కనేవుంది అప్పుడు.

ఆవాళ, ఆరోజున, ఆ చిన్నపిల్ల రాలేదు.

తరువాత పదిరోజులకు వాళ్ళమ్మతో వచ్చింది. ఇంట్లో అడుగుపెట్టగానే, వాళ్ళమ్మ ఆపిల్లను యెత్తుకుంది. తనని అమ్మ కావిలించుకుంది. తన ముఖాన్ని గుండెల్లో దాచుకుంది. తరువాత ఆ చిన్నపిల్ల వాళ్ళమ్మతో వెళ్ళిపోయింది. కొద్దిరోజులైన తరువాత మళ్ళీ తాను బడికివెళ్ళాడు. పున్నాగచెట్టు మళ్ళీ పూలుపూసింది. దుఃఖమంటే యేమిటో తెలీని ఆ వయసున ఆ దుఃఖాన్ని కొద్దిరోజుల్లోనే మరచిపోయాడు.

పున్నాగపూలు మళ్ళీ మళ్ళీ ఆ అమ్మాయి ఒడినిండా నింపాడు. ఆ ఊళ్ళోనుంచి పోవలసి వచ్చింది. ఆ ఇల్లు సరస్వతివాళ్ళు కొన్నారట. అమ్మ చెప్పింది ఆ వయసులో కొంతకొంత అర్థమైంది. ఇంక మామయ్యవాళ్ళింటికి చేరుకుందామనుకుంటున్న సమయంలో ఆస్పత్రికి వెళ్ళవలసి వచ్చింది

అసలు ప్రాణంపోవాల్సింది. "ఇంకా నువు అదృష్టవంతురాలివి. ఇంకా ఆ కష్టం మరచిపోయి మూడునెలలు కాలేదు. ఇంతలో యీ కష్టమే వచ్చినట్లయితే నువ్వేమై పోయేదానివో" అన్నారు ఇరుగుపొరుగువాళ్లు ప్రకాశరావు అమ్మతో.

ఆస్పత్రిలో రెండు నెలలు వున్నారు.

మళ్ళీ ఆఊరొచ్చిన తరువాత ఆస్పత్రి విషయాలు చెపుతుంటే ఆ చిన్నపిల్ల ప్రకాశరావువేపు బిక్కుబిక్కుమంటూ చూసేది. ఏడుపుముఖంతో చూసేది. కళ్ళల్లోనీళ్ళు నిండేవి.

"సరిగా మాటాడరాదూ. ఎందుకలా మాటాడతావు ? అనేది" ఆ చిన్నపిల్ల.

ప్రకాశరావు సరిగానే మాట్లాడాలనుకునేవాడు.

కాని, కాని నాలిక మెలికలు తిరిగేది. మాట వచ్చేది కాదు. స . స....సరస్వతీ .. అని వచ్చేది.

ఆ చిన్నపిల్ల మొదలుమొదలు ప్రకాశరావు అలా మాటాడుతుంటే బిక్కచచ్చిపోయేది. పదిరోజులు గడిచేసరికి ఆ చిన్నపిల్లకు ప్రకాశరావు అలా మాట్లాడుతుంటే సరదాగా వుండేది. బళ్ళో అందరు పిల్లలతోటీ తాను నవ్వేది, ఓసారి బడి విడిచిన తర్వాత, ఇళ్ళకు పరిగెత్తుకుంటున్న పిల్లల్లో సరస్వతిని జడపట్టుకుని లాగి చెంపమీద కసికొద్దీ కొట్టాడు ప్రకాశరావు. ఆ చిన్నపిల్ల ముఖం కప్పుకొని యేడ్చింది. ఏడు మరి...న...నన్ను....వె....వెక్కిరించడం, యె .. యెందుకు" అన్నాడు.

ఆవాళ అమ్మ తనని కొట్టింది. ప్రకాశరావుకి బాగా గుర్తు, తాను మళ్ళీ బడికిపోలేదు. మామయ్యగారి ఊరు వచ్చేశారు.

ఆవాళ సరస్వతి మళ్ళీ ఇవాళ కనిపించింది. మళ్ళీ ఇవాళ తనని వెక్కిరించింది. ఆ అమ్మాయి కాలేజీకి యెందుకు వచ్చింది ? కాలేజీలోగాని చేరుతుందా ?

అయితే రోజూ ఆ అమ్మాయిని చూస్తూ తాను బ్రతుకలేడు. ఇలానే తనను వెంటాడుతుంది కాబోలు. వెక్కిరిస్తుంది కాబోలు. సరస్వతిమీద తనకు చెప్పలేని కసి. ఏడ్చుకోవటం కన్నా ఆ కసి తీర్చుకోవటం యెలానో తనకు తెలీదు. పోనీ, యీ సారి వెక్కిరించినప్పుడు అవమానంచేస్తే. ఎలా.... ఛాఛా....ఇలాటి చెడ్డతలపులు కలుగుతున్నాయేం తనకు. అందుకనే తన అదృష్టం ఇలావుంది. సరస్వతిని తాను మెప్పుకోవటం అలావుంచి, కనీసం యెదురు నిలబడి మాటాడలేడు. తన ముఖంమీద అరచేతితో కొట్టుకొన్నాడు. ప్రకాశరావు లేచి కూచున్నాడు.

అన్నీ తుడిచిపెట్టుకుని, యీ బ్రతుకు ఇంతేనని సరిపెట్టుకుని, కాలేజీకి వెళదామనుకున్నాడు. కాని కాలేజీటైమ్ దాటిపోయింది. మూడుగంటలై వుంటుంది. రూములో చాపమీద పడుకుని అమ్మకు వ్రాయవలసిన ఉత్తరంగురించి ఆలోచించుకుంటూ అలానేవున్నాడు ప్రకాశరావు. బయట యెండ తగ్గిపోవటం అతడికి తెలీదు. ఇదమిత్థమని నిర్ణయించలేని ఆలోచనలతో అలసిపోయినాడు. నిద్రపోయినాడు. నిద్రలోకూడా వెలితి. కన్నీళ్ళు. బాధ.

నిద్ర లేచేసరికి వీధిలో దీపాలు వెలిగాయి.

గబాగబా భోజనంచేసి వద్దామని బయలుదేరాడు ప్రకాశరావు. ముఖం కడుక్కున్నా అద్దంలో చూసుకుంటే కళ్ళల్లో దుఃఖం కనపడుతునే వుంది. ఈ చివరి సంవత్సరం యెంత త్వరగా గడచిపోతే అంత బావుండును. వాళ్ళిల్లు చేరుకున్నాడు. రామారావు యెదురుగావచ్చాడు. "మధ్యాహ్నం కాలేజీకి రాలేదేమిరా ప్రకాశం." ప్రకాశరావు మాట్లాడలేదు. "పొయెట్రీక్లాసులో మేష్టారు నీగురించి అడిగారు." ప్రకాశరావు మాట్లాడలేదు భోజనం చేసేప్పుడు కూడా ప్రకాశరావు తలవంచుకునే కూచున్నాడు. రామారావుకి జాలిగావుంది. క్లాసులో ప్రకాశరావుని చూసీచూడగానే రామారావుకి జాలి కలిగింది. తరువాత స్నేహం వృద్ధి అయింది. దాని ఫలితంగా ప్రతి మంగళవారం ప్రకాశరావు రామంతో కలసి భోంచేస్తాడు. ప్రకాశరావుకి ఏమాత్రం అభిమానం లేకపోయింది. ప్రకాశరావుని వొప్పించేందుకు రామారావుకే చాలా అభిమానం కలిగింది. ప్రకాశరావుకి అలవాటేను. వారంలో యీ మంగళవారమేనా. తక్కిన ఆరురోజులూ అతడిట్లానే భోజనం చెయ్యవలసి వుండె.

చెయ్యి కడుక్కుని సావిట్లో కూచున్నతర్వాత రామారావు యెదురుగా కూచున్నాడు. రామారావు అడుగుతున్నాడు- "ఏమిటి ప్రకాశం, మీ అమ్మనుండి ఉత్తరంగాని వచ్చిందా? ఎందుకలా వున్నావు?"

"ఏమండీ ప్రకాశరావుగారూ. మీకు పొద్దున కోపంగాని వచ్చిందా" మృదువైన స్వరం వెనుకనుంచి వినబడింది ప్రకాశరావుకి. ప్రకాశరావు తిరిగి చూశాడు. అతడికి యెదురుగా త్రాచుపాముని చూచినట్లనిపించింది క్లాసులో మాస్టరు సమాధానం తెలియని ప్రశ్నను అడుగుతున్నట్లనిపించింది. ఒక్కసారి వులిక్కిపడ్డాడు. పూర్తిగా తలవంగిపోయింది.

రామారావు చెపుతున్నాడు. "మా పెద్దమ్మ కూతురురా, ప్రకాశం. ఇక్కడ ఇంటర్‌లో చేరింది. బై. పి. సీ. నోయ్. ప్రిన్సిపాలు మాకు తెలిసినవాడేగా. అరె నీకూ్కడా తెలుసునట్లుందే. మా సరు సగం మగరాయుడు."

సరస్వతి నవ్వుతోంది.

"అత్తయ్యగారు యెక్కడ వుంటున్నారు."

ప్రకాశరావు సమాధానం చెప్పలేకపోయాడు. రామారావు చెప్పాడు.

"మా మామయ్య కొడుక్కి చిన్నతనంలో ఇలానేమాట సరిగా వచ్చేదికాదు. తరువాత హోమ్యోపతీ యేదో వాడారు" సరస్వతి చెపుతున్నది. ప్రకాశరావుకి తలకొట్టేసినట్లనిపించింది.

"మా మామయ్యకొడుక్కి ఇప్పుడదేం లేదు."

"ఉన్నా నువు చెపుతావటే. రేపు మేమంతా వెక్కిరిస్తామని భయం." రామారావు చెల్లెలితో పరిహాసమాడుతున్నాడు. ప్రకాశరావు అక్కడ కూచోలేకపోయాడు.

"వ...,వస్తానురా" ప్రకాశరావు వేగంగా వాకిలిదాటాడు. వీధిలోమాత్రం అతి నిదానంగా నడుస్తున్నాడు. అడుగుతీసి అడుగువెయ్యటమే భారమైంది. సరస్వతి ఇక్కడకూడా ప్రత్యక్షమైందేం! తన బ్రతుకుతో సరస్వతి కేమిటో యీ సంబంధం. సరస్వతి కనిపించినప్పుడల్లా తన వెలితి తనకు పెద్దదై కనిపిస్తుంది.

ప్రకాశరావు రూము చేరుకున్నాడు.

ప్రకాశరావుకి భోజనం చేసినట్లు లేదు. ఆ నాలుగు గోడల మధ్య విద్యుద్దీపపు వెలుగులో యీ ప్రపంచంలో తనకేమీ లేదనిపించింది. తానింక రామారావు దగ్గరకు రోజూ యెలా పోగలుగుతాడు? తన దుఃఖంలో మధ్యమధ్య రామారావు కొద్దిగా ఉపశాంతి. తన జీవితంలోని రహస్యాలు, తన బాధలు, గాథలు, సమస్యలు, ఒక్కటీ దాచకుండా చెప్పాడు రామారావుకి. రామారావుకి చెప్పుకుంటే హృదయంలో పెద్ద బరువు తొలగినట్లుగా వుంటుంది. అందుకనే చెప్పుకున్నాడు. కాని, యీరోజున సరస్వతి అడ్డుగా నిలబడింది. ఆమెను చూస్తే తనకు భయం. ఈ సంఘటన చిత్రంగా లేదూ. ఎన్నో రోజులతర్వాత ఆమె మళ్ళీ యెందుకు ప్రత్యక్షం

కావాలి. అదీ రామారావుకీ చెల్లెలుగా యెందుకు ప్రత్యక్షం కావాలి. రోజూ కాలేజీలో తన కెందుకు కనపడాలి. జీవితం చిత్రమైంది. ఏరోజు కేవిధంగా జీవితంలో పరిణామాలు వస్తాయో యెవరికి తెలుసు. ప్రకాశరావు నిరీహుడై నిద్ర పోయాడు.

ఎంత తప్పించుకు తిరుగుదామనుకున్నా ప్రకాశరావుకి కాలేజీలో వీల్లేకపోయింది. సరస్వతి యెక్కడో, యెప్పుడో యెదురుపడేది. ఎప్పుడు అభిమానంగా మాట్లాడుతుందో ఎప్పుడు వెక్కిరిస్తుందో తెలీదు. నాలుగైదుసార్లు యెంతో అభిమానంగా మాట్లాడేది. ఎప్పుడైనా "ప్ర... ప్రకాశరావు గారూ, బొత్తిగా కనపడటమేలేదు" అనేది ఆమె దూరంగా కనపడితే ప్రకాశరావు ఏక్లాసు రూములోనో దాక్కునేవాడు. ఇంకోమార్గంగుండా పోయేవాడు. ఎప్పుడేనా వీధిలో కన పడితే గిరుక్కున వెనక్కుతిరిగి పోయేవాడు. ఒకసారి పార్కుకి వెళితే అక్కడ సరస్వతి కనపడింది. ప్రకాశరావు వేగంగా వెళ్ళిపోయాడు అక్కడనుంచి ఒకసారి స్నేహితు డొకడు ఆ రైల్లో వస్తాడని స్టేషనుకి వెళ్ళాడు ప్రకాశరావు. అక్కడ సరస్వతి కనపడింది ఆ స్నేహితుడు తనగది వెతుక్కుంటూ వచ్చిందాకా, అతడు వచ్చాడన్న విషయం తెలియలేదు ప్రకాశరావుకు కాని స్టేషన్లో సరస్వతి ప్రకాశ రావుని చూసింది. ఒట్టి చూడటమేకాదు. తనని చూసి వేగంగా వెళ్ళిపోవటంకూడా చూసింది. ఒకసారి వీధిలో యెదురుపడి నప్పుడు ప్రకాశరావు యెంతో బాధపడుతున్నవాడిలా దొంగలా పక్కవీధిలోకి తప్పుకోవటం ఆమె చూడలేక పోలేదు. కాలేజీలో ప్రమాదవశాత్తూ యెదురుపడితే ఒక్కొక సారి ప్రకాశరావుముఖం కోపంగానూ, ఒక్కొసారి దిగులు తోనూ, ఇంకోసారి దీనంగానూ, ఇంకోసారి అయిష్టం గానూ, అయిపోవటం ఆమెకు తెలిసింది. ప్రకాశరావుకి లాగానే ఆమెకూ ఒక్కొసారి కోపం, ఒక్కొసారి జాలి, ఇంకొకసారి నిర్లక్ష్యం, మరోసారి వెక్కిరించాలన్న కసి తీర్చుకునే లక్షణం కలగకపోలేదు.

ఒక మంగళవారం సాయంకాలం ఏడుగంటలవేళ రామా రావు ప్రకాశరావు రూములోకి గాలిలా వచ్చాడు.

"ఇవాళ నువెందుకు రాలేదు ?"

ప్రకాశరావు మాట్లాడలేదు.

క్రితంవారం ఆరోగ్యం సరిగా లేదంటివి. ఆ క్రితంవారం రూముకి రెండుసార్లు వచ్చాముగదా, కనపడకపోతివి, ఇవాళ యెందుకు రాలేదు. నా మనసున కెంత కష్టం కలుగుతున్నదో నువ్వు ఆలోచించావా. ఏమిటో విషయం నాకు వివరంగా చెప్పు. అంతకంటె ఎక్కువ తెలిసికోవాలని నాకు లేదు. నేను చూస్తున్నాను. క్లాసులో ఈమూడు వారాలు నువు భోజనం చేస్తున్నావా ? ఎవరిమీద నీకసి ? మనం యెన్నెన్ని విషయాలు చర్చించుకొన్నాం. బ్రతికే విధానం ఆలోచించుకో లేదూ. అన్నీ ఇలా యెందుకు మరిచిపోయావు ?"

ప్రకాశరావు మాట్లాడలేదు. రామారావుకి యేమీ తోచ లేదు.

"మన స్నేహం ఇలా మధ్యలో తెగిపోతుందని నేననుకో లేదు, నేను వెళుతున్నాను.

"క్ష....క్షమించురామం. నేను నీతో ఇప్పుడు చె....చెప్ప దలుచుకు....న్నది చె....ప్పలేక పోతున్నాను. ఇక....మీ.... ఇం .. ఇంటికి రాలేను."

రామారావు మౌనంగా వెళ్ళిపోయాడు. ప్రకాశరావు ఇంతకుముందు జీవితంలో యెప్పుడూ పొందనంత బాధ పొందాడు. ఆవాళ రాత్రంతా రామారావుతో గంటల గంటల తరబడి మాట్లాడి తన బ్రతుకులోని చిన్న చిన్న విషయా లన్నీ గుర్తు వచ్చాయి, తరువాత మూడురోజులు కాలేజీకి వెళ్ళలేక పోయాడు. తరువాత పదిహేనురోజులు అమ్మ దగ్గర వుండివచ్చాడు. అమ్మదగ్గరనుండి యెప్పుడు రావా లన్నా అతడికి దుఃఖమే. అమ్మ తలంటుపోసింది గిన్నె నిండా యేవోచేసి వద్దన్నా బ్రతిమిలాడి సంచీలో పెట్టింది. ఈ పదిహేనురోజులూ కాలేజీ యేమైపోయిందో ప్రకాశ రావుకి తెలియదు. రూములో అడుగుపెట్టగానే దుఃఖో ద్వేగాన్ని ఆపుకోలేక పోయాడు. కాగితపు ముక్కలన్నీ యేరాడు, వీధిలోపోయే కార్లు, లారీలు బళ్ళురేపిన దుమ్మంతా పుస్తకాలనిండా, పక్కబట్టలనిండా, చాపనిండా పేరుకుని వుంది. ఏరుకున్న కాగితపు ముక్కలమీద అక్షరాలు తడిసిన కళ్ళపొరలమధ్య- "నువ్వెక్కడికి వెళ్లావు. నా దుఃఖం యెవరికి చెప్పుకోను. నీ రామం" అలాటి కాగితపు ముక్కలు పదో పన్నెండో వున్నాయి. ప్రకాశరావు లెక్కపెట్టలేక పోయాడు. ఆ దుమ్మునిండిన చాపమీదనే కూలబడిపోయాడు. తాను యెక్కడకుపోయినా దుఃఖంతప్ప యేమీ లేదు. అమ్మ పరిస్థితి అక్కడయేమీ బాగులేదు. ఇక్కడకు వస్తే ఇదీ - అలా యెంతకాలం గడిచిందో అతడికి తెలియదు. వీధిలో దీపాలు వెలిగాయి.

తలుపెవరో తట్టారు. తన కళ్ళను తాను నమ్మలేక పోయినాడు. దిగులంతా, దైన్యమంతా, సంతోషమంతా ఒక్కచోట కూడుకున్నట్లుగా సరస్వతి తన యెదురుగా నిలుచుంది. అతడికి కసీ, కోపమూ, అసహనమూ పెల్లు బికాయి. ఏమీ చెయ్యలేక పోయాడు. తలవంచుకున్నాడు.

"వారం రోజులనుండి రోజూ వస్తున్నాను. ఇవాలిటికి కనపడ్డారు." ప్రకాశరావు నమ్మలేకపోయినాడు.

"లేవండి. కాస్త యీ దుమ్ము శుభ్రం చేస్తాను." తలుపు చాటున వున్న చీపురు తీసుకున్నది సరస్వతి. ప్రకాశరావు లేచాడు. సరస్వతి నేల చిమ్ముతున్నది.

"రామం అన్నయ్యను మీరు సరిగా అర్థం చేసుకోలేదు" చాప మళ్ళీ పరిచింది. పుస్తకాలు సర్దుతూ "ఇవాళ మీరు మా ఇంటికి వస్తారా. సరేసరి. లేకపోతే నే నిక్కడనుంచి కదిలేది లేదు. ఏమైనా సరే."

ప్రకాశరావుకి ఎన్నో విషయాలు చెపుదామని వుంది. కాని. కాగితమూ కలమూ తీసుకున్నాడు. దానిమీద ఇలా వ్రాస్తూన్నాడు. మధ్యమధ్య సరస్వతి మాటలు అడ్డు వస్తున్నాయి.

"నేనీ ఊళ్ళో వుండటం మీ కిష్టం లేదులా వుంది. చెప్పండి. వెళ్ళిపోతాను. ఈ కాలేజీలో నేను చదవటం మీ కిష్టం లేదా - అసలు నేను చదువుకోవటం ఇష్టంలేదా - నేను మీకేం అపకారం చేశాను చెప్పండి."

....... .......

"హఠాత్తుగా మా ఇంటికి రావటమే మానేశారు... మా రామం అన్నయ్య చెప్పిందాకా నాకు తెలీదు. మీరు ఇటు వంటివారని."

"ఇలా అనుకుంటే యీ ఊళ్ళో చేరేదాన్నా... ఇంతకూ మీకు నేనేమి అపకారం చేశాను చెప్పండి. నేను బ్రతకటం మీ కిష్టం లేదా "

ప్రకాశరావు సరస్వతివేపు చూశాడు. ఆమె కళ్ళు నీళ్ళు నిండాయి.

"పోనీ రేపు చదువు మానేసి మా ఊరు వెళ్ళిపోనా."....

"చెప్పరేం, చెప్పండి అలాగే వెళ్ళిపోతాను. మళ్ళీ మీకు ముఖం చూపను"....

"ఆ ఉత్తరం ఎవరికి వ్రాస్తున్నారు. నాకు సమాధానమా-పోనీలేండి. అదేచాలు. ఏది నేను చూసేదా."

ప్రకాశరావు మధ్యమధ్య కళ్ళెత్తి ఆమెవేపు చూస్తున్నాడు. మళ్ళీ వ్రాసుకుంటున్నాడు. సరస్వతి మౌనంగా అతడివేపు బిక్కుబిక్కుమంటూ చూస్తూ కూచుంది. ఆమె ఇంక మాట్లాడలేక పోతున్నది. అరగంట గడిచింది. ప్రకాశరావు వ్రాస్తున్నది పూర్తిచేశాడు. ఆమె చేతికందిచ్చాడు. ఆమె చూచుకుంటున్నది. అతడు చెప్పలేని ఉత్సుకతతో ఆమెవేపు చూస్తున్నాడు. ఆమె చదువుకుంటున్నది.

"శ్రీమతి సరస్వతికి...."

ఏమందోయి తప్పురాశారు. మొదటి వాక్యంలోనే. నేను శ్రీమతినికాను. ఆమె దిగులుగా నవ్వింది. మళ్ళీ....

నా కథ నేను చెప్పుకుంటున్నాను. ఈ నిమిషంలో యీ విధంగా నా ఆలోచనలను మీకు చెప్పుకోటానికి నాకు చాలా సిగ్గుగావుంది. అయినా నేను ఇంతకంటే వేరువిధంగా మీకు చెప్పలేను. నాకు దుఃఖం వస్తున్నది. అసలు యీ ప్రపంచంలో నాకు దుఃఖంతప్ప యేమీ మిగలదేమోననిపిస్తున్నది. ఈ మాత్రమైనా మీకు తెలియచెప్పుకోవటానికి రామారావు నా గురించి మీకు చాలా చెప్పాడని నామనసు చెపుతున్నది. అందుకే వ్రాయటానికి, మీకు చూపించటాకి సాహసిస్తున్నాను.

మేము బీదవాళ్ళము. మా అమ్మ వాళ్ళవాళ్ళ కాళ్ళు పట్టుకుని, అందరి ఇండ్లలో నానా చాకిరీ చేసి నన్ను పెద్దవాణ్ణి చేస్తున్నదని చెప్పుకోవటానికి నాకు సిగ్గుగాలేదు. నాలో అభిమానం చచ్చిపోయి చానాళ్ళైంది మా నాన్న పోయిన తర్వాత పల్లెటూళ్లో మా ఇల్లు అమ్ముకోవాల్సి వచ్చింది. మా మామయ్యగారింటికి చేరిన తర్వాత మనస్సు యెదగవలసిన సమయంలో, నేనంటే నాకు అసహ్యమూ, కోపమూ, కలిగి నేను వంచింపబడ్డాను. ఎన్నిమార్లో మా మామయ్యమీద, మామయ్యగారి పిల్లలమీద కసితో నన్ను నేను శిక్షించుకొన్నాను.

తరువాత నేను పెద్దవాణ్ణైనాను. నాలో దుఃఖంకూడా పెద్దదైంది.

నా జీవితంలో నేనిలా కావటా కి ఒక రహస్యముంది. ఆ రహస్యం ఇప్పుడు చెప్పుకోవటానికి నాకేమాత్రమూ సిగ్గు లేదు.

ఇవాళ ఆమాటలు చెపితే మోసగించటానికి చెపుతున్నానని, వ్యామోహంకొద్దీ చెపుతున్నానని, వయసు ఇలా చెప్పిస్తున్నదనీ అనుకోవటానికి అవకాశముంది. కాని వ్యామోహం తెలియని వయసున, జరిగిన సంఘటన, దాన్ని యేమంటారో నాకు తెలియదు. స్నేహమంటావా—ప్రేమ అనాలని నాకులేదు. ఎందుకంటే నాకు అప్పుడు తొమ్మిది పదేళ్ళకంటే యెక్కువుండవు. ఆ చిన్నపిల్లకు ఏడెనిమిదేళ్ళ కంటే యెక్కువుండవు. ప్రేమకంటే యెక్కువదీ, స్నేహం కంటే తియ్యనైనదీ, ఏదో మా ఇద్దరిమధ్యా ఆరోజుల్లో వుండివుండాలి. ఆ చిన్నపిల్లపేరు ఇప్పుడు నేను చెప్పదలచుకోవటంలేదు. ఆ చిన్నపిల్లను మళ్ళీ నేను జీవితంలో చూస్తాననుకోలేదు. అసలు నేను వాంఛించనేలేదు. కాని ఇవాళ అందుకు పూర్తిగా వ్యతిరేకంగా జరిగింది. అలా జరగటంవల్ల నాకు దుఃఖంతప్ప యేమీ మిగలలేదు. ఆచిన్న పిల్లను....ఆ చిన్న వయసులోనే, ఆ చిన్నచిన్న రెండు

జడలతోనే నా హృదయంలో గుప్తంగా దాచుకొన్నాను. కాని ఆమె పెద్దదై నన్ను వెక్కిరిస్తున్నప్పుడు నాకు దుఃఖం వచ్చేది.

ఆమె ఒడినిండా పున్నాగపూలు నింపాను. పచ్చగన్నేరు పూలు నింపాను. ఆ చిన్నపిల్లబుగ్గలమీద పున్నాగపూలరేకులు వుమ్మితో తడిపి బుడగలుచేసి టప్‌మనిపించాను. ఆపున్నాగ పూల వాసనలు ఆ చిన్నపిల్లను తలుచుకుంటే ఇప్పటికీ నామనసులో మెదులుతవి. ఆ చిన్నపిల్లనుగురించి ఇంకా యెక్కువ నేను చెప్పలేను.

ఇవాల్టి నా జీవితంలో అసలాపిల్లను నేను గుర్తు చేసుకోవటమే కూడదు. ఆ రహస్యం చెబుతాను. అంతటితో నేను చెప్పదలచుకున్నది పూర్తవుతుంది.

మానాన్న పోయిన కొత్తరోజుల్లో ఆ చిన్నపిల్ల నాకు మరీ దగ్గరయింది. ఇవాళ నేను పూర్తిగా మారిపోయాను. ఆ రోజులకూ యీ రోజులకూ సాపత్యమేలేదు. ఆచిన్నపిల్ల నన్ను విడిచి వొక్కక్షణం వుండేదికాదు, నిద్రవేళతప్ప. ఇవాళ నాకు యీ పరిస్థితులు రావటానికి ఆ అమ్మాయే కారణం. ఆమె పెద్దదైంది. ఆమెమీద నాకు కసి. కాని ఆ చిన్నపిల్ల నా మనసులో మెదిలినప్పుడు నా గడిచిపోయిన జీవితం వట్టి యెడారికాదని ఇవాళ నేను చెప్పుకుంటాను. నాకు కథలు వ్రాయటం చేతకాదు. కవిత్వం అసలు వ్రాయలేను. లేకపోతే యెంతో వ్రాసేవాణ్ణి. కాని ఇవాళ ఆచిన్నపిల్ల పెరిగి పెద్దదై నా ముందు నిలుచుంటే నాకు కోపం. ఎందుకో నాకు తెలీదు, బహుశా ఇందుకనుకుంటాను.

నా జీవితంలో నాకు పూరించరాని, పూరించలేని వెలితి వొకటి యేర్పడింది. ఆ వెలితికి—ఆ చిన్నపిల్ల బాధ్యురాలు. పెద్దదైన ఆ చిన్నపిల్లకు ఆ విషయం తెలియదు. అసలు విషయం చెపుతున్నాను.

ఓ రోజున ఆ చిట్టీ నేనూ, బడి లేకపోయినా బడికి పోయినాము. బడివుంటే పొయ్యేవాళ్ళం కాదేమో ఎందుకు వెళ్ళాము? ఆ చిట్టికి పున్నాగపూలు కావాలట. అవాళదాకా నాకు నోట్లో నాలిక మెలికలు తిరిగేదికాదు. మాట తడబడేది కాదు. అక్షరాలు నోట్లోనే ఆవృతి అయ్యేవి కావు. మామూలుగా అందరిలానే మాట్లాడేవాణ్ణి. ఇవాళ ఇలా వుండకపొయ్యేవాణ్ణి అవాళ అంతయెత్తు పున్నాగచెట్టు చిటారి కొమ్మమీదికి పోకపోయినట్లైతే—నేనేం రాజకుమారుణ్ణా. ఎవరో రాజకుమార్తె కోరిన బంగారు రామచిలకను తేవటానికి పదేళ్ళ పసివాణ్ణి. పాపం ఆ చిట్టికి మాత్రమేం తెలుసును. అన్నీ పూలు విచ్చుతున్న అంతలావు పూలగుత్తి ఆ పిల్లకు అందంగా కనపడింది. అందుకే కావాలంది. నేను కాలుజారి పడతానని ఆ పిల్లకు తెలుసునా. తరువాత యేం జరిగిందో నాకు తెలీదు. ఆ పూలగుత్తి ఆ పిల్లకు నేను అందించలేకపోయాను. ఆస్పత్రిలో నాకళ్ళు తెరిపిడిపడ్డాయి. అమ్మా అని పిలవటానికి నా నాలుక మెలికలు తిరిగింది. అ....మా....అమ్మా అన్నాను. మా అమ్మకు అదే పదివేలయింది. కొడుకును వెంటబెట్టుకుని యెప్పుడో యేడుకొండలవాడి దగ్గరికి పోతుందట. మళ్ళీ ఆస్పత్రినుంచి ఆ ఊరు చేరుకున్నాను. ఆ పిల్ల నేను అలా మాట్లాడుతుంటే మొదలు మొదలు భయంతో కుంచించుకుని పోయేది. పాపం యేడ్చేది. తరువాత తరువాత, అలవాటైన తర్వాత వెక్కిరించటం నేర్చుకుంది. ఆ చిన్నపిల్ల పెద్దదైంది కాబట్టి బహుశా గుర్తు వుండివుండదు. అవాళ ఒకరోజున చెంపమీద వేళ్ళు యెలా వాతలు తేలాయో!

ఇంతకూ సరస్వతిగారూ, నేను చెప్పదలచుకున్న దేమిటంటే, మీరు నా ముందుకు రావద్దు. దానివలనే నాకు దుఃఖం వస్తుంది. రామారావుని నేను అర్థం చేసుకోకపోవటమేం! ఈ ప్రపంచంలో అమ్మ తరువాత రామారావే నాకు ఆప్తుడు. అతడి ఋణాన్ని యీ నత్తివాడు తీర్చుకోలేడు. ఎందుకంటే కృతజ్ఞతలు చెప్పుకుందామనుకున్నా మాటలురావు. కన్నీళ్ళు అడ్డువస్తాయి.

సరస్వతిగారూ, మీమీద నాకు కోపంలేదు. ఎప్పుడేనా కోపమొచ్చినా యెక్కువసేపు నిలవదు. ఎందుకో తెలుసా మిమ్మల్ని చూస్తే ఆ చిన్నపిల్ల నా కళ్ళముందు నిలుచుంటుంది. ఆ చిన్నపిల్లను నేనేమీ అనలేను. ఆ చిన్నపిల్లను మళ్ళీ చూడాలనిపిస్తుంది నాకు.

ఇంక యెక్కువ వ్రాయదలచుకోలేదు. ఇదంతా మీచేత చదివిస్తున్నందుకు సరస్వతిగారూ నన్ను క్షమించండి. రామారావుకి యీ విధంగా చెప్పమని మీకు నేను చెప్పలేను. ఇక ముగిస్తున్నాను.

ఆఖరివాక్యంగా, ఇదంతా చదివిన తర్వాత నా వైపు చూసి నన్ను మాటాడించే ప్రయత్నం చెయ్యకుండా వెంటనే వెళ్ళిపొండి. మీమీద నాకేంకోపం లేదు - మళ్ళీ మళ్ళీ యీ వాక్యమే వ్రాయటం - అనవసరం -

సరస్వతి ఆ ఉత్తరం మొత్తం చదివింది. క్రింద చేవ్రాలు లేదు. ఆమెకు నీళ్ళలో మునిగి వుక్కిరి బిక్కిరి అయినట్టుగా వుంది. ప్రకాశరావువేపు చూసింది. ప్రకాశరావు తనవేపే చూస్తున్నవాడల్లా గిరుక్కున అవతలవేపు తిరిగాడు. సరస్వతి కళ్ళనిండా నీళ్ళు నిండాయి. ఆమెకు యేం చెయ్యాలో తోచటం లేదు. ఆమె తనని తాను సంబాళించుకోలేక పోతోంది. వెక్కివెక్కి యేడ్చింది. ప్రకాశరావుకి

చిత్రంగా వుంది. తనకి యేడుపురావటం లేదు. మనసంతా ప్రశాంతంగా వుంది. బరువంతా తీరిపోయినట్లుంది. సరస్వతి వేపు చూడబుద్ధి పుట్టడం లేదు అతడికి. అతడికని తీరి పోయినట్లనిపించింది. సరస్వతి లేచి నిలబడింది. హఠాత్తుగా ప్రకాశరావు లేచి నిలుచున్నాడు. ఆమె వెళ్ళిపోతుంది అను కున్నాడు. కాని ఆమె వెళ్ళిపోయే ప్రయత్నంలో లేదు. ఎదురుగా వచ్చింది. తన ఎదురుగా తనను తాకుతున్నంత దగ్గరగా వచ్చింది. ప్రకాశరావు తలవంచుకున్నాడు. ఆమె యేడుస్తున్నది. ఆమె యేడుపును తాను వింటున్నాడు. ప్రకాశరావుకి యెందుకో హాయిగావుంది. ఆమె ఇంకా దగ్గరకు వచ్చింది. అతడు తల యెత్తవలసి వచ్చింది. ఆమె వేపు చూశాడు. ఆమె కళ్ళలో దుఃఖంలేదు. వెలుగుంది. ఆ వెలుగు నతడు చూడలేకపోయాడు. చిటారి కొమ్మమీది పెద్ద పూలగుత్తిని చూపించి కావాలని చెపుతున్న చిన్నపిల్ల కళ్ళముందు నిలిచినట్లనిపించింది. అతడు తనలో కలిగిన సంచలనాన్ని చిక్కబట్టుకోలేక పోయాడు. రెండు చేతులూ చాచాడు. కాని ఆచేతులు ఆమెను పట్టుకోలేదు. మళ్ళీ మామూలుగా వెనక్కు తీసుకున్నాడు. అతడు ఆశ్చర్య పోయినాడు. ఆమె కళ్ళలో ఆణిముత్యాల్లా కన్నీటి బిందువులు మిలమిల లాడుతున్నాయి. అతడు కళ్ళు పెద్దవిచేసి చూశాడు. ఆమె కిలకిలా నవ్వింది. అతడు కళ్ళు మరీ పెద్దవిచేసి చూశాడు. ఆమె నవ్వాపుకుని ఇలా అన్నది.

"ఏమండీ ప్ర—ప్ర...కా....కా....శ....శ....రావుగారూ నన్ను క్ష....క్ష....మించగలరా" ఆమె అతడికి మరీ దగ్గరగా వచ్చింది.

జ్ఞానం తెలిసిన తరువాత మొట్టమొదటిసారిగా యీ జీవితానికి దిగులులేకుండా అతడు నవ్వాడు.

# టైఫాయిడు గీతం

గోపాల చక్రవర్తి

ఆకవాటం ఇంక తెరవకు
కన్నెత్తి చూడను ఋషులను, కాపురుషులను
ఎడద ఎండిపోయింది ఇపుడు
ఎవరినీ కలవను,
చంద్రుడు కనిపించని కలువను
ఎవరినీ పిలువను
ఇప్పుడు రాలిపడిపోతే మళ్ళీ మొలవను.

అప్తుడెవడైనా తలుపు తట్టిన చప్పుడు విందామని
ఒళ్ళంతా చెవులు చేసుకున్నాను
గుళ్ళో మోగిన గర్భగుడి గంటలచప్పుడు
గుండెల్లో వినిపించినప్పుడు
ఎవరో పిలుస్తున్నారని
ఎంతో సంతోషించాను.

ఆకు అల్లాడితే సరి ఎవరని పలుకరించాను
రోడ్డుపై రిక్షా అలికిడి అయితే
నాకోసమే దూరదూరాలనుంచి
స్నేహసముద్ర తీరాలనుంచి
ఎవరో వొచ్చారని లేచి
శయనీయం మీద కూర్చున్నాను.

వీథిలో తలుపుతట్టిన ధ్వని వినిపిస్తుందా ?
ఇటువైపున నాకోసం రిక్షా
ఇకమీదట వస్తుందా !

నాలుగు గోడల మధ్య బాష్పశీనదిగా
జాలువారింది
పరీభావం మనస్సులో బాధిస్తూ మిగిలింది
ఇపుడు నా ఎద మౌనమహతి-
మరి పలకని ఘోషవతి

తెగేవరకూ దారం లాగి
ఆఖరి క్షణంలో చుట్టూముగి
అనునయ వాక్యాలు చెప్పటం.
అదీ మనకు ఆచారం!
అప్పుడే మనమధ్య ఏర్పడింది
శతయోజనాల దూరం.

సమయానికి సంజీవిపడని రోగికి
సమయం దాటిన పిమ్మట
బళ్ళకొద్దీ గుళికలు సరఫరా
చేయకపోతేనేం, హరహరా!

నాటకాంతంలో ప్రేక్షక నిష్క్రమణం తరవాత
నేపథ్యంలో నటీమణి
నాట్యగాన పాండితీ ప్రకర్ష
అద్భుత భావప్రదర్శన చికీర్ష
ఎవరికోసం ? ఎందుకోసం ?

అందరూ విడనాడినా అంతరిక్షంలో రిక్కలు
వీడు నిరుత్సాహపడ్తాడని
తోడుగా నిలబడ్డాయి.

ఎదురుగా కదలక నిలుచున్న కొండ
ధైర్యం నూరిపోసి నను పలకరించే అండ
ఉల్లాసంగా పెరిగిన చెట్లు ఊగుతూ పాడుతున్న
ఉత్సాహ గీతం ఈ ఏకాకికి అమృతపాతం.

జగదీశ స్రష్టమైన క్ష్మాచక్రపు భ్రమణరీతి
ననుకరించి తిరుగుతోంది నరనిర్మితమైన ఫాను
ప్రకృతి ఇచ్చే ఆప్యాయం
కృతక జగతిలో మృగ్యం.

ఇవాళ తెలిసింది జీవితం
ఒంటరితనానికి మరోపేరని
నా బరువు నేనే మోసుకుంటూ నడవాలని.

# విశ్వనాథ అయ్యర్ గడచిన కాలము*

శ్రీ కేశవమెనన్‌గారు కేరళయొక్క వయో వృద్ధ రాజనీతిజ్ఞులుగా సుప్రసిద్ధులు. రాజనీతి మార్గములో వారిపాదము లెన్నోసార్లు కంటకచ్ఛిన్నములై రక్తప్లావితములైనవి. పేదరికమువలన వారి హృదయమునకు పగిలిపోవునంత బాధ కలిగెడిది. అయినప్పటికి వారు నిరాశా ప్రవాహములో మునిగిపోలేదు. సాహసముతో ముందుకు నడచుచునే పోయినారు. బారిష్టరు, రాజకీయ కార్యకర్తలు, 'మాతృభూమి' సంపాదకులు, ప్రజానాయకుడు, ఇండియన్ ఇండిపెండెన్సులీగు సదస్యులు, సిలోన్‌లో పైంకమిషనరు మొదలైన భూమిక లెన్నింటినో వారి జీవన నాటక రంగముపై ధరించిరి. పై చెప్పబడిన రూపములతో కాక ఒక ప్రసిద్ధలేఖకులుగా కూడ వారు యశస్సు నార్జించిరి. వారిగ్రంథములలో ముఖ్యమైనవి భూతభవిష్యములు (భూతవుం భావియుం) దానభూమి, జీవిత విచారములు (జీవితా చింతకల) గడచినదినములు (కషిఞ కాలం) మొదలైనవి.

'గడచినకాలము' ఆత్మకథ. ఇది డెబ్బది యేండ్ల వయస్సులో వ్రాయబడినది. రచయిత గ్రంథమును తన చిన్నప్పటి విద్యాభ్యాసమును వివరించుటతో ప్రారంభించును. ఆ కాలమే వేరు. కేరళదేశముయొక్క ప్రాచీన సంస్కృతి, దాని సాంప్రదాయిక రీతులు నిర్వహింపబడుచుండెడివి. పడిపోవుచున్న గోడలను నకిలీ స్తంభముల నానించి నిలబెట్టు ప్రయత్నము జరుగుచుండెడిది. ఈ రచయిత యొక్క పితామహులు పాలఘాట్‌లోని ప్రాచీన రాజవంశీయుల సంతానములో నొకరు. ఈ రాజవంశమునకు రాజ్యాధికారము దాదాపు నాస్తి. ఒక పెద్ద జమీందారుకున్న సంపత్తి మాత్రముండెడిది. రాజభవనముయొక్క అస్త్రశాల వట్టి ప్రతిష్ఠా చిహ్నముగా మాత్రమే యుండెను. ఈ స్థితిని మెనన్‌గారు మిక్కిలి మనోహరముగా వర్ణించినారు.

ఈ సందర్భములోనే రచయిత ప్రసిద్ధములైన కేరళకుటుంబములయొక్క జీవనవిధానము, మాతృపక్ష ప్రాధాన్యముయొక్క ప్రాముఖ్యము, సామాన్యప్రజల వినోదములు, ఆటపాటలు మొదలైనవి మిక్కిలి మనోహరమైన శైలిలో వర్ణించినారు. స్మరణీయములైన ఎన్నో సంఘటనలతో కూడుకొనిన స్కూలు జీవనము గడపినతరువాత వారు కాలేజి విద్యాభ్యాసమునకై మదరాసు పోయిరి. వీరు కాలేజిలో చేరిన దినములు రాజకీయ సాంఘిక పరివర్తనకు పేరుగన్నవి.

స్వాతంత్ర్య చికీర్షువులైన నవయువకులు ప్రభుత్వమును, తదనుయాయులను బహిరంగముగా ఎదిరించుచుండెడివారు. రాజకీయముగా గలిగిన జాగృతి సామాజిక జీవనములోకూడ ప్రతిబింబించినది. కాలేజి విద్యార్థులైన మెననగారు క్రొత్తరకముగా వెంట్రుకలు కత్తిరింపించుకొని, చర్చలలో దాయభాగపక్ష మవలంబించి తండ్రిగారియొక్కయు, మామగారియొక్కయు, విరోధమునకు పాత్రులైరి. కేరళలో ఆనాటి సాంఘిక రాజకీయనాయకులలో సర్. సి. శంకరనాయర్

* గడచినకాలము (కషిఞ కాలం) రచయిత కె. పి. కేశవమెనన్. 1958 లో సాహిత్య అకాడమీ బహుమానము పొందుకొన్న మళయాళ గ్రంథము.

గారు ప్రముఖులు. వారు వైస్రాయి యొక్క ఎక్జిక్యూటివ్ కౌన్సిలుసభ్యులు. మరొక ప్రముఖులు శ్రీ టి. ఎమ్. నాయర్ గారు మద్రాసు యొక్క జస్టిస్‌పార్టీ సభ్యులు.

బారిస్టరీ విద్యకొరకు మెనన్‌గారు విదేశములు వెళ్ళిరి. అక్కడ వారు కేవలము పుస్తకములతో కాలము వెళ్ళబుచ్చక అనేకస్థానములు పర్యటించిరి. స్వతంత్ర పోరాటములో పాల్గొనెడి ప్రసిద్ధ కార్యకర్తలనేకులు ఆరోజులలో ఇంగ్లండు వెళ్ళెడివారు. ఈ ప్రవాసులకు స్వదేశము యొక్క స్వాతంత్ర్యమునందు మిక్కిలి ప్రేమ యుండెడిది. అభిమానధనులైన మెనన్‌గారు అనేకావసరముల యందు భారతీయుల గౌరవమును సురక్షితముగా నుంచుటకు మిక్కిలి ప్రయత్నము చేసిరి. ఈ ప్రత్యేకగుణము వారి వ్యక్తిత్వమునకు వన్నె బెట్టినది. వయస్సుతోబాటు ఈగుణము వృద్ధిజెందుచునే వచ్చినది. స్వదేశమునకు తిరిగివచ్చిన తరువాత దేశసేవా కార్యములో నిమగ్నులగుటకు ప్రథమప్రేరణ వారి కింగ్లండులోనే లభించినది.

'గడచిన కాలములో కేరళలో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ మరియు హోంరూలు ఆందోళన యొక్క చరిత్ర ముఖ్యముగా చెప్పబడినది. ఈ రెండు సంస్థలను గురించిన ప్రామాణిక వివరము లొసంగు గ్రంథము మళయాళములో దుర్లభము.* అందువలన కేరళలోని రాజకీయోద్యమములను గురించి తెలిసికొనగోరు భవిష్యద్విద్యార్థులకీ గ్రంథమవశ్య పఠనీయమగుచున్నది. 1916 లో హోంరూలు ఉద్యమము కేరళలోగూడ ప్రారంభమైనది. కే. శే. మంచేరీరాం అయ్యర్ ఈఉద్యమమునకు సంచాలకులు. ఈ ఉద్యమములో ఇతర కాంగ్రెసు సేవాకార్యక్రమములో శ్రీ కేశవ మెనన్‌గారు స్వయముగా పాల్గొన్నారు, మెల్ల మెల్లగా వృద్ధిలోనికి వచ్చుచున్న వకీలువృత్తి, తమ కుటుంబము యొక్క అసంతృప్తికరమైన ఆర్థికపరిస్థితి, ఈ రెండింటికిని ఈ కార్యక్రమము అపాయకరమే యైనది. అయినప్పటికిని వారు తమ పట్టువదలలేదు. తెల్లవారి ఉద్దండతను సహించలేదు. ఆరోజులలో ఒకప్పుడు యుద్ధనిధికి డబ్బు సేకరించుటకు తెల్ల కలెక్టరు అధ్యక్షతలో ఒక పెద్ద సభ జరిగినది. అందులో కేశవ మెనన్‌గారుకూడ ఉపన్యాసకులు. వారు మళయాలభాషలో చెప్ప మొదలిడిరి. అధ్యక్షులు వారించిరి. ప్రజాభాషలోనే మాటాడవలయునని చెప్పుచు వారు అధ్యక్షుని ఆజ్ఞను నిరసించి సభనువదలి వచ్చిరి. వారివెంట దేశప్రేమ పరాయణులైన వ్యక్తు లనేకులు వచ్చిరి.

ప్రజాసేవ-వకాలతు ఈ రెంటిని ఒకదానివెంట ఒకటి నిర్వహించు కోరికతో శ్రీ మెనన్‌గారు మద్రాసును తమ కేంద్రముగా జేసికొనిరి. మదరాసులో వారికి అనేక ప్రజాకార్యకర్తలతో, మహాపురుషులతో కలియు అవసర మేర్పడినది. యౌవనోత్సాహము, సాధ్యమైనన్ని రీతులుగా ప్రజాసేవ చేయవలయునని సంకల్పము. అందువలన వారెన్నో రంగములలో ఎంతో కొంత కార్యము చేసిరి కార్మికులను సంఘటిత పరచుట, న్యూఫేబియన్ సొసయిటీలో చర్చలు, గుప్తసంఘములలో విప్లవకర రాజకీయ కార్యములను గూర్చిన ఆలోచన మొదలైన వివిధ విరుద్ధరూపములలో మెనన్‌గారి సేవాకార్యము ముందుకు నడచినది. శ్రీ వి. పి. వాడియా చక్కరచ్చెట్టి, శ్రీరాములు, వా. వే. సు. అయ్యర్, సుబ్రహ్మణ్య ఆర్య, దురైస్వామి మొదలగు ప్రముఖ వ్యక్తుల సత్సంగము వారికి లభించినది. రాజాజీ స్నేహాశీర్వాదములు గూడ వారికి లభించినవి. కాంగ్రెస్ సహాయ నిరాకరణోద్యమము ప్రారంభించినప్పుడు కేశవ మెనన్‌గారిముందు కూడ పెద్ద సమస్య వచ్చిపడినది. అప్పుడప్పుడే మదరాసులో తమ వృత్తి పుంజుకొనుచున్న దినములు. నెత్తినిండ అప్పులు కుటుంబసమస్యలు తట్టెడు. సహాయనిరాకరణ మనగా సర్వనాశనము.

* కే. శే. ఎ. కె. పిళ్ళెగారి 'కాంగ్రెసు-కేరళరాష్ట్రీయము' అను గ్రంథము ఈ విషయములో ఉత్తమమైనది.

కాని వారు దేశ ప్రేమకు అనుకూలమైన నిర్ణయ మునే గైకొనిరి. రాజాజీ ఆశీర్వాదము గైకొని తమ కార్యమును నిర్వహించుటకు కొషిక్కోడు చేరుకొనిరి. వారి ఆర్థికస్థితిని గుర్తెరిగిన రాజాజీ వారికి కొంత డబ్బిచ్చుట మరవలేదు. రాజాజీ యొక్క ఈ దయాళుత్వమును వారు కృతజ్ఞతా పూర్వకముగా స్మరించినారు.

1920 లో ఇతర ప్రాంతములలోవలెనే కేరళలో గూడ సహాయనిరాకరణ, ఖిలాఫత్ ఉద్యమములు వెంటవెంట నడచినవి. ఖిలాఫత్ కమిటీలతో కాంగ్రెసు కమిటీలు సహకరించి కలిసి మెలిసి కార్యక్రమమును నెరవేర్చినవి. ఆనాటి ప్రముఖ కార్యకర్తలలో శ్రీ ఎ.కె. పిళ్లై, శ్రీ మొహమ్మద్ అబ్దుర్రహమాన్, మొహమ్మదు ముసలియార్, మోటతూ మౌల్వీ మొదలైనవారి పేర్లు విశేష ముగా పేర్కొనబడినవి. పిళ్లేగారు కొన్ని సంవత్స రముల తరువాత అభిప్రాయభేదముల వలన ఎం. ఎన్. రాయ్ పార్టీలో చేరికొనిరి. ఆక్సుఫర్డు విద్యను వదలుకొని తమ సమస్తమును దేశమునకై వెచ్చిం చిన పిళ్ళెగారు మరపునకు రారు. మొహమ్మదు అబ్దుర్రహమాన్‌గారు అలీగడ్ విశ్వవిద్యాలయ ములో విద్యాభ్యాసమువదలి దేశసేవకై ముందుకు వచ్చిన ఉత్సాహశీలురు. వారు తమ కార్యమును నిర్వహించుటలో ఎన్నో కష్టములు పడి తుదకు అకాలమరణమునకు పాత్రులైరి.

మలబార్‌లో ఖిలాఫత్ ఉద్యమము కొన్ని దిన ములలో ఉగ్రరూపము వహించి 'మలబార్ విప్ల వము' ఐనది. దీనియొక్క సంక్షిప్తకథనము అనేక ఇతిహాస గ్రంథములలో దొరుకును. ఈ విప్లవము నకు కారణములేవి ? దీని రూపురేఖ లెటువంటివి? అన్న విషయమునుగురించి అనేక అభిప్రాయము లున్నవి. 'గడచినకాలము' యొక్క రచయిత తమ ప్రత్యక్షానుభవము యొక్క ఆధారముపై దాదాపు నలువది పుటలవరకు ఈ విప్లవమును విపులముగా వర్ణించినారు. మెనన్‌గారు వ్రాసిన దానినిబట్టి ఖిలాఫత్ ఉద్యమము మొదట శాంతియుతముగానే జరిగెను. కాని ప్రభుత్వముయొక్క దమననీతివలన ప్రబల క్రోధాగ్ని ప్రజ్వరిల్లెను. నిరాయుధులైన ప్రదర్శనకారులపై కాల్పులు జరిపి మసీదులపై దాడిచేసి ప్రభుత్వము ప్రజలను కోపోద్రిక్తులనుచేసి వారిని హింసాపథము నవలంబించుటకు ప్రేరేచెను. మొదటినుండి తుదివరకు ఈ ఉద్యమములో మత విద్వేష లక్షణము కనపడలేదు. హిందువులు ముస ల్మానులు కలిసియే ముందుకునడచిరి. సిపాయిలు ఎందరినో హిందువుల రొమ్ములకు కత్తులానించి విప్లవకారులజాడలు తెలిసికొనెడివారు. కాని విప్లవ కారులు తమజాడలు చెప్పువారిపై తీవ్రముగా ప్రతీకారము గైకొనుట మొదలుపెట్టిరి. అంతే కాదు విప్లవము తీవ్రమై విస్తృత మైనప్పుడు కొందరు మతాంధులైన ధూర్తులు అవకాశము జూచి బలవంతముగా హిందువులను మతాంతరు లనుచేయ మొదలుపెట్టిరి. దూరదర్శనములేని విప్లవకారులు అహింసా మార్గముయొక్క వైల క్షణ్యమును గుర్తించక తెల్ల ప్రభుత్వముతో యుద్ధమునకు దిగిరి. తుపాకులు, మరఫిరంగులుగల సైన్యమును వీరెంతకాలమని ఎదిరించగలరు. విప్లవ కారులను ఖైదుచేసి సిపాయిలు వారికి పైశాచిక మైన ప్రతీకారముచేసిరి. ఈ ప్రతిహింసయొక్క ఒక ఉదాహరణము చదివిన శరీరము గగుర్పొడు చును. "1920 నవంబరు పదవతేదీనాడు తొంబది మంది విప్లవకారులు తిరూరునుండి కోయంబత్తూరు వరకు ఒక ఇనుపపెట్టెలో కొనిపోబడిరి. దాదాపు నూటఇరువదిమైళ్ళ ప్రయాణము. ఆ యినుపపెట్టె అన్నివైపులమూయబడి గాలివెలుతురులు రాకుండ నుండెను. తుపాకికి తగిలిఉన్న కత్తి మొనలు చూపించి బంధితులను భయపెట్టి బలవంతముచేసి ఆ పెట్టెలోనింపిరి. రైలు తిరూరునుండి వెలు వడెను. లోపల దప్పిలో, వేడితో, కొట్టుకొనుచున్న ఆ అభాగ్యుల హాహారావములు కొంతవరకు త్రోవ పొడుగున వినిపించుచునే యుండెను. ఆ తర్వాత

మెల్ల మెల్లగా సర్వమును నిశ్శబ్దమయ్యెను. మధ్య రాత్రి బండి ప్రొద్దునూరు జంక్షను (కోయంబత్తూరునుండి నాలుగుమైళ్ళు) చేరుకొనెను. పెట్టె తలుపు తీసినతరువాత మహాబీభత్సమైన దృశ్య మెదురయ్యెను. ఒకరితోనొకరు చుట్టుకొని, పర స్పరము గిల్లబడి, కొరుకబడి, కనుగ్రుడ్లు చిట్లి బయటపడి, నాలుక నోటినుండి బయటికి వ్రేలాడి, చెమటచే, మూత్ర పురీషాదులచేత దుర్గంధ హేయ మైన తొంబది మానవాకారములు, కొన్నిచచ్చి మరికొన్ని సగముచచ్చి బయటబడెను. అరువది నలుగురు మరణించిరి. మిగిలినవారు మృత తుల్యులైరి.

'గడచినకాలము' యొక్క మరొక ముఖ్య ప్రసంగము కేరళయొక్క బహూకృత పత్రిక 'మాతృభూమి' ప్రకటనమునకు సంబంధించినది. అసహాయోద్యమపురోజులలో ప్రభుత్వపు దమన నీతిని నిర్భయముగా ఖండించుటకు ఒక సాహసము గల పత్రిక అవసరమయ్యెను. పత్రికవలన ఆర్థికముగా లాభముకన్న నష్టమే యెక్కువ. ఈ విపరీత పరిస్థితిలో కూడ మెనన్‌గారు తమమిత్రుల సహాయముతో కొన్ని షేర్లు వసూలు చేయగలిగిరి. వారు స్థాపించిన 'మాతృభూమి' పత్రిక ఇప్పుడు కేరళలో అన్నింటి కన్న ఎక్కువసుప్రతిష్ఠితమైన పత్రిక. దీనియొక్క దైనిక సాప్తాహిక, సాప్తాహికాంతిమ సంచికలు వెలువడు చుండును. వార్తాప్రచురణములో, సంపాదకీయ భావములలో మాతృభూమి తన నిష్పాక్షికతకు పేరు గన్నది. కేరళ వార్తా పత్రికా జగత్తులో మాతృభూమి మిక్కిలి గౌరవముతో పేర్కొనబడును.

మెననగారి జీవితములోని మరొక మార్మిక ఘట్టము అతి ప్రసిద్ధమైన "వైక్కమ్ సత్యాగ్రహము"నకు సంబంధించినది. కేరళయొక్క పురాతనగ్రామమైన వైక్కమ్‌లో ఒక శివాలయము కలదు. ఆ దేవాలయములో అస్పృశ్యులకు ప్రవేశము లేకుండెను. ఆలయమునుండి కొంత దూరములో నున్న రోడ్డుపైగూడ అస్పృశ్యులకు నడచుట కధికారము లేకుండెను. ఈ యవమానమునుండి వారిని ముక్తులను చేయుటకై గొప్ప సత్యాగ్రహము జరిగెను. ప్రస్తుతము ద్రావిడ కషగం నాయకులైన రామస్వామి నాయకర్ అప్పుడు కాంగ్రెసు కర్తలు. వా రప్పుడు సత్యాగ్రహముచేసిరి. మహాత్మా గాంధీ గారు కూడ ఆ సత్యాగ్రహములో వచ్చిరి. ఈ సంఘటనవలన ప్రజల కన్నులు కొంత విచ్చు కొన్నవి. తరువాత 1937లో తిరువాంకూరు మహారాజుగారు హిందూ జాతికి చెందినవారి కందరకు ఆలయ ప్రవేశమున కనుజ్ఞ నొసగుటకు ప్రేరకమైన వానిలో ఈ సత్యాగ్రహముకూడ నొకటి. ఈ సత్యాగ్రహములో మెననగారు పాల్గొని జైలుశిక్ష ననుభవించిరి.

జైలులోనుండి బయట పడువరకు వారి పరిస్థితి మిక్కిలి కష్టమైపోయెను. ప్రభుత్వ పక్షపాతులైన బంధువులు వారితో కలియుటకుగూడ వెనుకముందాడుచుండిరి. సనాతను లీ హరిజన సేవకుని జూచి పండ్లు కొరుకుచుండిరి. వారికి దినవెచ్చము కూడ సరిగాలభింపక పోవుచుండెడిది. ఈ స్థితివలన పరమ నిరాశకలిగి నప్పుడు పరమేశ్వరుని దయాస్వరూపముగా ఏదోయొక అజ్ఞాత కారణమువలన ఎంతో కొంత డబ్బు వారికి చేతజిక్కు చుండెడిది. ఈ విషమదశలో వారి భార్యలక్ష్మికి క్షయతగిలెను. రాజకీయ, సంపాదకీయ కార్యములన్ని వదలి భార్య చికిత్సకు మెనన్ గారికి మదరాసు పోవలసి వచ్చినది. సమస్తోపాయములు విఫలములై చివర కొకనాటి కాళరాత్రి ఆమె ప్రపంచమును వదలి పెట్టెను.

మెనన్‌గారి మలయాజీవనము 'గడచినకాలము' లోని మరొక మలుపు. పెద్దదైన కుటుంబమును చక్కదిద్దుట సమస్యయై దానిని పరిష్కరించుటకు వారు తమ భార్యయొక్క సోదరిని, విధవను, వివాహము చేసికొనిరి. అప్పటికిని జీవితములో

వారికి శాంతి సంతోషములు లభింపలేదు. ఋణ దుఃఖభారానమితుడైన మెనన్‌గారు ఒక మిత్రుని సలహాపై మలయాకు పోవుటకే నిశ్చయించిరి. మలయాలో భారతీయులైన వకీళ్ళకు కొంత సంపాదించుటకవకాశముండెను. అందువలన నలువది యొకటి సంవత్సరముల వయస్సులో వారు సకుటుంబముగా మలయా చేరుకొనిరి. ఆర్థిక పరిస్థితి కొంత చక్కబడినప్పటికి మెనన్ ఋణ విముక్తులు కాలేదు. ఎన్నోసార్లు వారి ఇంటిలోని వస్తువులు జప్తు చేయబడినవి. ఒకప్పుడు పడవలో నదిని దాటుచుండగా అందులో దూకి ప్రాణత్యాగము చేయవలయునని కూడ వారి కనిపించినది. కాని ధైర్యము చెడక వారు ముందుకు నడచి యథా సంభవముగా ప్రజాసేవ చేయుచునే యుండిరి. స్థానికులైన తెల్లవాళ్ళ క్రోధమునకు గూడ వారు గురియైరి. కాని ఎల్లప్పుడును దృఢమనస్కత, స్వాభిమానము వారి కవచములై రక్షించినవి.

ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలములో మొదట జపాను సింగపూరును వశపరచుకొన్నది. తరువాత మిత్రరాజ్యములు జపానును పారద్రోలి జపానీయులను కఠోరముగా దండించిరి. ఈ రెండు సైనికశాసనముల దుష్పరిణామమును మెనన్‌గారు తమ కన్నులతో జూచిరి. వా రనుభవించిన విషయముల సంక్షిప్త పరిచయము 'గడచిన కాలము' యొక్క కొన్ని అధ్యాయములలో దొరకును. ఈ అనుభవముల వివరణములు 'భూత భవిష్యత్తు' లలో దొరకును.

1942 ఫిబ్రవరి పదునారవ తేదినాడు సింగపూరును వశపరచుకొన్న తరువాత జపాను సైనికాధికారులు భారతీయులతో స్నేహమొనర్చుకొనిరి. యుద్ధము తరువాత భారతీయులకు స్వాతంత్ర్య మిప్పించెదమని వాగ్దానము చేసిరి. అందుకొరకే వారు ఇండియన్ ఇండిపెండెన్సు లీగు అను పేరుతో ఒక సంస్థకూడ వారు స్థాపించిరి. భారతీయుల సహాయముతో యుద్ధములో విజయ మొందుటయె వారి లక్ష్యము. ప్రసిద్ధులైన శ్రీ కేశవ మెనన్‌గారిని జపాను సైన్యాధికారి పిలిపించి ఇండియన్ ఇండిపెండెన్సు లీగు సదస్యునిగా జేర్చిరి. ఇతర సదస్సులలో కర్నల్ ఢిల్లన్ శ్రీ రాఘవన్ మొదలైనవారు కూడ నుండిరి. జపానువారి సమాదరణము కారణముగా శ్రీ మెనన్‌గారి గృహస్థ జీవనము ఒడిదుడుకులు లేకుండ సుఖముగా సాగుట మొదలైనది. వారు లీగుయొక్క ప్రచార కార్యదర్శులుగా నియుక్తులైరి. జపానువారి ఎత్తులు తెలిసిన వెంటనే మెనన్‌గారు లీగు సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరి. దానికి తగినఫలము వారనుభవింపవలసి వచ్చినది.

లీగునుండి వేరైన కారణముగా జపాను సైనికులు వారిని సందేహముతో చూడసాగిరి. కొన్నాళ్ళ తరువాతనే వారు ఖైదుచేయబడిరి. జైలులో సిపాయీల బూట్లు తుడుచుట, బట్టలుతుకుట మొదలైనపని మెనన్‌గారికి మరియు సర్ జాన్ స్కాట్ (తరువాత మలయా కమిషనర్ జనరల్)కు ఇవ్వబడినది. ప్రాణము దక్కించుకొనుటకు వారు దొంగతనముగా కూడ జైలుయొక్క భారతీయ అధికారితో ఇంటినుండి భోజనము తెప్పించుకొను ఏర్పాటు చేసికొనవలసివచ్చినది. ఆకలితో మరణించుటకు సిద్ధముగా నున్నవాడు సిద్ధాంతపాలనము వెంటబడి ఏల పరుగెత్తవలయునని మెనన్ అనుభవపూర్వకముగా వ్రాసినారు. పదునేను నెలల కారాగారము తరువాత సింగపూర్‌పై మిత్రరాజ్య విజయముతో వారు విడుదల చేయబడిరి.

తమ అనుభవముల ఆధారముగా వారు తమ పత్రికలో ('మాతృభూమి') వ్రాసిన వ్యాసముల మూలముగా కేరళవాసు లనేకులకు వారిపై కోపము వచ్చినది. వారు కేరళకు తిరిగివచ్చినపుడు కొంతమంది వ్యతిరేక ప్రదర్శనలు కూడ చేసిరి. వారి మిత్రులు కొంతమంది చుట్టుముట్టి వారిని రక్షించకపోయినచో వారి ప్రాణముల కపాయము కూడ కలిగియుండెడిది.

కేరళకు తిరిగి వచ్చిన తరువాత మెనన్‌గారు మాతృభూమిని తిరిగి చేపట్టిరి. పత్రిక అదివరకే సువ్యవస్థితమై యుండుటచేత వారికెక్కువ కష్టపడవలసినయవసరము కలుగలేదు. భారతదేశముకూడ స్వతంత్రమైనది. ఏ సుసమయముకొరకు వారు ప్రతీక్షించుచుండిరో ఆసమయము వచ్చినది. ఐనను కేరళభాషాప్రాంత మేర్పడలేదు. 1951 లో వీరు సిలోన్‌కు హైకమిషనర్‌గా నియుక్తులైరి కాని

అక్కడ ఒకే సంవత్సరముండుటకు వారి కవకాశము కలిగినది. సిలోను భారతీయుల కనుకూలముగా నియమము లేర్పరించుటకు తాము యథారీతి ప్రయత్నము చేయుచుంటిమని వారు ఘంటాపథముగా చెప్పినారు కాని సిలోన్ ఇండియన్ కాంగ్రెస్ అసమయమందు ఆందోళనము ప్రారంభించినది. ఈ ఉద్యమమువలన దుఃఖితులై మెనన్ గారు తమపదవికి రాజీనామా నిచ్చి కేరళకు తిరిగివచ్చిరి. తిరిగి వచ్చినతరువాత వారిమనస్సు కేరళ భాషారాష్ట్రము ఏర్పరచుటవైపు మొగ్గెను. తుదకు కేరళ రాష్ట్రముకూడ ఏర్పడినది కాని కేరళ రాష్ట్రమునకు వారిమనస్సులో ఏ సరిహద్దు లుండెనో అవ్లేర్పడలేదు. కేరళవాసుల మానసిక ప్రవృత్తికూడ వారేవిధముగా ఉండవలయు నను కొన్నారో ఆవిధముగా లేకుండపోయినది. అయిననుఆశావాదులైన మెనన్‌గారు అధీరులు కాలేదు. కేరళభవిష్యత్తు ఉజ్జ్వలము కాగలదని వారి దృఢ విశ్వాసము.

ఈ పుస్తకమును మూడు విధములుగా విమర్శించవలయును. రచయిత యొక్క వ్యక్తిగత జీవిత మొకటి. గ్రంథము యొక్క చారిత్రక మహత్త్వము రెండవది. రచయిత యొక్క భావముల ఉత్తమత్వము మూడవది. మెనన్‌గారి వ్యక్తిగత జీవనము యొక్క సాఫల్య వైఫల్యములగూర్చి విచారించవలసిన యవసరములేదు. ప్రజాసేవ యొక్క విభిన్న రంగములలో మిక్కిలిగా కష్టపడిన సజ్జనుడుగా మెనన్‌గారు పాఠకులకు ప్రత్యక్షమగుదురు. ఈశతాబ్ద పూర్వార్ధము యొక్క రాజకీయచరిత్ర నర్థము చేసికొనుటలో ఈపుస్తకము సహాయకారి యగును. మలబారు విప్లవము, వైక్కం సత్యాగ్రహము యొక్క రూపురేఖలే కాక అనేక కర్మశీలురైన సజ్జనులగూర్చి రేఖాచిత్రము లిందెన్నియేని కలవు. ఈ లోకము మిక్కిలి కృతఘ్నమైనది. అది తనకు సేవచేసిన వారిని తొందరగా మఱచిపోవును. ఈసేవావ్రతులనుస్మరింపజేయుట చరిత్రకారునిపని. కేరళరాష్ట్రమును గురించిన ఆందోళన విషయములో చరిత్రకారుని కర్తవ్యము మెనన్‌గారు బాగుగా నెరవేర్చినారు. ఆయన అభిప్రాయముల ఉత్తమత్వమును గురించి అభిప్రాయభేదము ఉండుటకు వీలున్నది. కాని నా అభిప్రాయములో ఆయన అనేక భావములను మననముచేసి మనవిగా చేసికొన్నచో అనేక అవకాశములయందు చింత, నిరాశ, అపాయాదులచేత తప్పుకొనవచ్చును. ఆయన భావములతో ఇతరులందరికి ఏకాభిప్రాయముండుట సంభవముకాదు. అవసరముకూడ లేదు. తన అభిప్రాయములను నిర్భయముగా ఇతరులకు చెప్పు ధైర్యమూయనలో నున్నది. అది నిజముగా ప్రశంసాయోగ్యము. 'గడచినకాలము' ఎవరో పండితులైన చరిత్రకారుని శుష్కవాణి ఐనచో దాని పాఠకులు తక్కువయ్యెడివారు. కాని కేశవ మెనన్‌గారు సిద్ధహస్తులైన రచయితలు. పాఠకుని మానసిక ప్రవృత్తి ఆయనకు బాగుగా తెలియును. సరళమైనశైలి, అర్థవంతములైన శబ్దములు, అక్కడక్కడ మనస్సును హరించు ఊహాలమెఱుపు, ఒక్కొక్కచోట వినోదప్రియత్వము ఈ విశిష్టతల కారణముగా ప్రస్తుత గ్రంథమునకు సాహిత్యలోకములో మంచిస్థానమున్నది.

మళయాళ భాషలోని ఆత్మకథా సాహిత్యము పరిపుష్టమని చెప్పుటకు వీలులేదు. గడచిన కొన్ని సంవత్సరములనుండి కొన్ని ఆత్మకథలు బయల్వెడలినవి. జీవితస్మరణకల్ (ఇ. వి. కృష్ణపిళ్లై), జీవిత సమరం (సి. కేశవన్) ఎంటో తిమ్మ (నాఅమ్మ - ఎన్. శ్రీ కంఠన్‌నాయర్) మొదలైనవి. ఈ యన్నింటిలో 'గడచినకాలము' శ్రేష్ఠమని యంగీకరింపబడినది. అనుభవజ్ఞులైన లేఖకులగుట మూలమున విషయవివేచనము, శబ్దరచన మొదలైనవానిని ఉచితరీతి నిర్వహించినారు. అధికభావావేశము కారణముగా జరుగు దోషములు మెనన్ గారి రచనలో నుండవు. భాష యొక్క ధారాళత, సరసత గ్రంథము యొక్క మాధుర్యమును పెంచినవి. సంపూర్ణగ్రంథము యొక్కశైలి చూచి రచయిత గాంధీజీ ఆత్మకథ రచనశైలిని అనుకరించినాడని చెప్పవచ్చును.

మళయాళ రచయితలు, పత్రికలు ఈ గ్రంథమును మిక్కిలిగా ప్రశంసించినవి.

(సంక్షిప్తము)

బులుసు-జీ-ప్రకాష్ | అక్షరశిలలు

ఇక్కడ జూపుమేర శిలలే! శిలలే! ఎటగన్న-కానలఁ
బెక్కు శిలల్; మహాగిరులమీద శిలల్; నది చాయలన్ శిలల్;
మిక్కిలి మండుటెండలను మ్రింగు నెడారుల దారులఁ శిలల్;
చిక్కని చేలలో శిలలు; చెర్వులచెంత శిలల్! శిలల్! శిలల్!

గుడికడ చూడు! చూడు మవిగో! శిల లెట్టివి నల్లవిఁ; గడుం
గడు విపులమ్ములైన యవి; ఖండ హిమమ్ముల పోల్కి దెల్లవిఁ;
నడచుచు ప్రక్కగా నరుగు నన్ను మనస్సున నింపి కోరికల్
వెడలగనీక ముందునకు వింతగ శృంఖల లల్లు కాళ్ళకుఁ!

చకచక అంగుళమ్ము చనజాలవ పాదము లాగిపోవు; మాం
త్రికములు కావుకా శిలలు! లేనియెడఁ చననీయ వెందుకో!
తికమక గాగ నున్నయది; దేవతలో! మునిశాపశక్తి భూ
మికి దిగజారి, రాలి, మరి మింటికి క్రమ్మరి పోవ రింటికిఁ!

చెప్పండీ తమరెవ్వరో శిలలు! మా చీకట్లు విప్పండి! మీ
రిప్పాషాణపు రూపులొందితి రదేమీ ఆనతియ్యండి! కీ
ర్గొప్పం బువ్వులుగా గుడుంగ సుమముల్ గూఢమ్ముగా నుండుటే
గొప్పా? ఎన్ని యుగాలనాటి శిలలొక్కో మీరు; మీరో శిలల్!

మీరలు కృష్ణరాయని అమేయ భుజాభుజగమ్ము దూకి పూ
త్కారము నేయునాటి వగు గ్రావములా? నవనీత హృత్తులో
బేరిన ప్రేమయెల్ల కురిపించి జగత్ప్రజ నేలినట్టి హం
వీరు డశోకవర్ధనుని వెన్నెల వెల్గిననాటి బండలా!

గౌతమశాక్య బుద్ధు సమకాలికులా? యువరాజు రేయి ను
జ్జాతుని, ప్రేయసిఁ విడిచి, సాగి, మహావనికిఁ బ్రసిద్ధ గం
గాతటి నున్న రావికడ గాఢ తపస్సొనరించి బుద్ధుడై
భూతదయా పరత్వమును బోధన చేసిననాడు నుండిరా!

ఉన్నారా! తమ రంతకన్న మునుపే! ఊహాతిగంబైన వె
న్నెన్నో రేలు; పవళ్ళు; సంధ్యలు; శరద్హేమంతముల్ గాలులఁ
కన్నారా! ప్రళయాభ్ర గర్జనలు విన్నారా! అనంతమ్ము మా
మన్నే పుట్టనినాడు పుట్టితిరటే మాణిక్యశోచి శ్శిలల్!

# అదృష్టంలో హాలాహలం | డా. రమాకాంత్

[రామయ్యఇంటి వసారా. రంగప్రదేశం కుడి భాగాన పైకిపోవడానికి మెట్లుంటై. (ఈ మెట్లు నిచ్చెనమెట్లు మాదిరి కావాలి) ఎడమవైపు తలుపు బయటనుండి ప్రవేశించుటకు, కుడివైపు మెట్లకు ముందుగా, ఇంటిలోపలికిపోయే తలుపు. వెనుక భాగం కిటికీ ఉంటుంది. మెట్లక్రింద కట్టెలు, చిల్లర వస్తువులుంటై. గదిలో ఒకకుర్చీ, ఒకస్టూల్ ఉంటై. తెరెత్తేప్పటికి మల్లమ్మ స్టూల్ మీదకూర్చొని ఆలోచిస్తూంటుంది. లోపలనుంచి చెయ్యి తుడుచుకొంటూ సుబ్బారావు, వెనుక నరసమ్మ ప్రవేశిస్తారు.]

సుబ్బా : అమ్మయ్య! కడుపులో దేవుడు చల్లబడ్డాడు. పగలంతా అడవిలో తిరిగి తిరిగి అలసిపోయినా. ప్రాణం సొమ్మసిల్లిపోయింది. అదృష్టంకొద్దీ మీఇల్లు కనబడ్డది. (కుర్చీలోకూర్చొంటాడు.)

నర్స : తీదకొంప! నా వంట, పెట్టు ఏం సయించినయ్యో ఏమో!... ఎండన బడొచ్చారు కూడాను.

సుబ్బా : (నవ్వి) అదేమన్నమాట! స్వయాన కాశీ అన్నపూర్ణేశ్వరే వడ్డించినట్లుంటే!... పంచభక్ష్య పరమాన్నాలతో ఎన్ని భోజనాలైనా మీ పెట్టుతో సరిపోలవు.

నర్స : మీరు తృప్తిపడితే అదేపదివేలు!

సుబ్బా : మీలోటివాళ్ళు దేశంలో ఇంకా ఉండబట్టే ఈమాత్రంగానన్నా ఉంది.

నర : ...మీలాటి మహారాజు లప్పుడప్పుడు కాని రారు! .... ఒక పూటుంటారు. తృణమో, పణమో ఇచ్చిపోతారు.

సుబ్బా : మీఋణం నే నేమాత్రం ఉంచుకోనండోయ్! .... అంటే తీర్చుకోగలిగినంత మట్టుకు తప్పక చెల్లిస్తాను.

నర : మీరు వేరేగాచెప్పాలా? మాకు తెలుసు.

సుబ్బా : ...... రామయ్యగారింకారాలేదు?

నర : వచ్చేవేళైంది.

సుబ్బా : ...ఇంట్లో మీరిద్దరాడవాళ్ళేఉంటారు, భయంగాఉండదూ?

నర : మాకేంభయం! ఇంట్లో ఏమిధనధాన్యాలున్నైయ్యని ఎవరుమటు కాశపడతారు? ..అథవా ఎవరన్నావచ్చినా మా మల్లమ్మచాలు, ఇద్దరికీ సమాధానం చెప్పగలదు.

సుబ్బా : ఔనౌను. మల్లమ్మ కండపుష్టి గలది.

నర : లేకపోతే ఎట్లా సాగుతుంది చెప్పండి. మగ పననక, ఆడపననక పొలంలో అన్నీ చెయ్యాలి, ...ఆయనా ఒంటరిగాడు.

సుబ్బా : ఏం? మగపిల్లలెవరూలేరూ మీకు?

నర : ... ఉండేవాడొకడు .... పదిహేనేళ్ళ క్రితం ఏట్లోబడి చచ్చిపొయ్యాడు.

సుబ్బా : పాపం! ... మా ఇంటిదగ్గర అలివేలమ్మగారి కొడుకు హఠాత్తుగ బస్క్రిందబడిపోయినాడు. ఆమెప్రతిరోజూ సమాధిదగ్గరకుపోయి పితపస్తూరి విచారిస్తూంటుంది.

నర : మాకా భాగ్యంకూడా లేదు!....ఏట్లోబడి కొట్టుకుపొయ్యాడు. శవంకూడా దొరకలేదు.

సుబ్బా : ఐతే చచ్చిపోయినాడనెట్లా?.... .... మొన్న సినిమాలోచూసా, ఇట్లాగే ఒక కుఱ్ఱాడు సముద్రంలో పడిపోతాడు, ఆఫ్రికాకెళ్తున్న ఒక

టడలోవాళ్ళు అతన్ని రక్షిస్తారు. అక్కడ ధనవంతుడై స్వగృహానికొస్తాడు.

మల్ల : సినిమాఅంటే ఏమిటేఅమ్మా ?

నర : తెరమీద మాట్లాడే బొమ్మలాట ! .... చెపితే ఏంతెలుస్తుంది ? చూడాలికాని !

మల్ల : మన ఊళ్ళోలేదే ?

నర : దిక్కుమాలినూళ్ళో ఏమున్నదికనుక ?

సుబ్బా : ..........మీరసలు సరిగా వెతికారా ?

నర : అన్నాళలు తీరినాకే....చచ్చిపోయాడని నిర్ణయానికొచ్చింది. సినిమాలోచూపించేవన్నీ జరిగేటట్లయితే బాగానేఉండును.

సుబ్బా : నాకెందుకో ...తప్పకుండా తిరిగొస్తాడని నమ్మకముంది.

(నర : వైరాగ్యపు చిరునవ్వు. నిశ్శబ్దం)

నర : పైన పక్కేశాను....పోయిపడుకోవచ్చు ....పాపం అలసిపోయున్నారు.

సుబ్బా : రామయ్యగారిని కూడా చూసిపోదామనుంది.

నర : వచ్చే వేళైంది. (లేచి బయటకు పోతూ) చూసొస్తానాగండి.

సుబ్బా : (కొంతసేపటూ ఇటు పచార్లు చేసి) మల్లమ్మా ! నువ్వీ ఊరు విడిచి ఎక్కడికీ వెళ్ళలేదా ఏం ?

మల్ల : లేదు.

సుబ్బా : ...నీలోటివాళ్ళు బస్తీలో ఉండాలి మల్లమ్మా!...అక్కడంతా చచ్చురకాలు ! ఏటిగాలికే ఎగిరిపోతారేమో నన్నట్లుంటారు.

మల్ల : నేనా !...(చేతులు చూపుతూ) ఈ బండచేతులు, నన్నూ చూసేమనుకొంటారు చెప్పండి బస్తీవాళ్ళు...మా రోజులీ చేలల్లోనే వెళ్ళాలి.

సుబ్బా : ఏమీ అక్కర్లేదు...జనతా మెటల్ వర్క్సులో రంగారావని ఫోర్‌మెన్ ఉన్నాడు. నాకు చాల స్నేహంకూడాను. ఈసారి కలసినప్పుడు నీ విషయం చెప్తా. సంతోషిస్తాడు...కండపుష్టి గల అమ్మాయి దొరక్క ఇంతకాలం పెళ్ళి చేసికోలేదు.

మల్ల : (సిగ్గుపడుతూ) నా పెళ్ళిగొడవ కూడా మీకు దేనికిలెండి.

సుబ్బా : (నవ్వి) కావాలో అక్కర్లేదో రేపు ప్రొద్దున నువ్వే చూద్దువుగాని (అలజడి. రామయ్య, నరసమ్మ ప్రవేశిస్తారు).

నర : వీరేనండి !

సుబ్బా : (దగ్గరకొచ్చి నమస్కరిస్తూ) మీరేనా రామయ్యగా రంటే...అడవిలో త్రోవ తప్పిపోయింది. తిరిగి తిరిగి చివర కదృష్టవశాత్తు ఈ ఇల్లు కనబడ్డది.

రామ : అడవిలో కెందుకెళ్ళారు ?

సుబ్బా : భువనగిరినుంచి భాగ్యనగర్ కెళ్దామనన ఉద్దేశ్యం...నాకు నడకంటే చెడ్డ సరదా. ఇరవైమైళ్ళేగదా నని బయల్దేరాను. అడవిలో దారి తెన్నూ తెలిసింది కాదు.

రామ : ఎక్కడి భాగ్యనగర్ ! ఉత్తరంగా పోతే ఆరుకోసు లుందింకా.

సుబ్బా : అట్లాగా !

రామ : ఈ ఊళ్లోనుంచి బండ్లు దొరుకుతైలెండి.

సుబ్బా : (నవ్వుతూ) వాటి సంగతి రేపాలోచిద్దాం లెండి.

రామ : ఔనౌను...ఆ సంచితో మీరు చాల అలసిపోయుండాలి...పడుకోండి పాపం !

సుబ్బా : దాంట్లో కాగితాలేలెండి ఉన్నది... కాని జేబుల్లో చాల డబ్బుంది. (బయటకు తీసి నోట్లుకట్టలు చూపుతాడు. నరసమ్మ, మల్లమ్మ, రామయ్య కళ్ళు పెద్దవిచేసి చూస్తారు.)

రామ : అంత డబ్బుతో ఈ అడవుల్లో ఒంటరిగా నడవటం చాల ప్రమాదం సుమా !

సుబ్బా : నిజంగానా!...నాకొక్క మానవుడూ కనబడనే లేదు.

రామ : అదృష్టవంతులు.

సుబ్బా : నడిచీ నడిచీ విసుగొచ్చి వాగు ఒడ్డున కూర్చున్నా. ఎండ తగ్గిపోయింది. ఇసుక తిన్నెలమీ

దెంతో హాయిగా ఉందండి! నీళ్ళల్లో చిరిచేపలు నృత్యం చేస్తూంటే గమనిస్తూ చాలసేపు గడిపా! సూర్యాస్తమయమైంది. పిట్టలు గూళ్ళుచేరి తెగరుస్తున్నై. అప్పుడు రాత్రి మాట గుర్తొచ్చింది. ఆకలి కూడా దహించుకు పోతున్నట్లుండింది... చూచాయగా అగుపించిన వొక కాలిబాట ననుసరించి వచ్చాను. సరాసరి ఇంట్లో తేలాను.

రామ: ఎగువన తూర్పుగా కొన్నిళ్ళున్నై. అక్కడి కెళ్ళలేదా?

సుబ్బా: నే నటుప్రక్క నుంచి కాదుగా వచ్చింది!...మొట్టమొదట కనుపించింది మీ ఇల్లే. నరసమ్మగా రాదరించాతిథ్య మిచ్చారు.

రామ: దానికేంలెండి...మీరు రావటం మా భాగ్యం!

సుబ్బా: (నవ్వుతూ) ఔనా!!...ఇక్కడ మీకు ప్రొద్దెట్లా గడుస్తుందాన నాశ్చర్య మేస్తుంది.

రామ: పొలంలో బోలెడన్ని పనులుంటై. అసలు తీరికే ఉండదు.

సుబ్బా: చలికాలమో!

రామ: అది మరీ ఘోరం! పనికూడా దొరక దెక్కడా! పొయ్యిలో పిల్లి లేవనేలేవదు.

సుబ్బా: అట్లాగా!

రామ: మరేం!...ముదనష్టపు కాలం రానే వచ్చేస్తున్నది.

సుబ్బా: కష్టించి కాస్తోకూస్తో ముందు కూడ బెట్టుకొంటే చలికాలం ఏ పట్టణంలోనైనా గడపచ్చు హాయిగా.

రామ: (నవ్వి) కూడ బెట్టమా! భలే! మా బ్రతుకులకు దినదిన గండమే. నాలుగు వేళ్ళు లోపలికి పోతే చాలు...నిలవచెయ్యేటం దున్నపోతులు కూడా పాలిస్తేనూ!

సుబ్బా: (నవ్వి) ఆ కాలమూ రావచ్చండోయ్! అదృష్టముంటే సిరిదొర్లుకొంటూ వస్తుంది.

రామ: ఔనౌను. అందుకే మీ పొలంలోకూడా రేగడిమట్టి తోలుతున్నది! .... అదృష్టమే ఉంటే ఈపాటికి రానేవచ్చేది.

సుబ్బా: సాహసే లక్ష్మీ అన్నారు పెద్దలు.

రామ: వాళ్ళమొహం! కడుపులో చల్ల కదలకండా కబుర్లు చెప్పడానికేం! నా స్థానంలో మూడురోజులుండి మాట్లాడమనండి. కొత్త వేదాంతం పుట్టుకొస్తుంది ... నేనూ అనుకొన్నా నరసమ్మను పెండ్లాడిన కొత్తల్లో ఈ పొలంలో బంగారం పండించవచ్చునని! కాలప్రభావంవల్ల పగటికలలై ఊర్కొన్నై.

సుబ్బా: ... పల్లెటూరి జీవితం చాలహాయిగా ఉంటుందంటారు.

రామ: డబ్బుంటేసరి, ఏ జీవితమైనా హాయిగానే ఉంటుంది.

సుబ్బా: సరేలెండి. ఆలస్యమైపోతున్నది. పడుకోవాలి. (లేస్తూ) టైమెంతైంది?

రామ: తొమ్మిదైందేమో!

సుబ్బా: మీ దగ్గర గడియారం కూడా లేదన్నమాట!! (నవ్వుతూ గోడకు తగిల్చిఉంచిన కోటు జేబులో నుంచి గడియారం తీసి గడియారం... తగిలిస్తాడు) ఇక్కడుంచుతా రాత్రిపూట టైమైనా తెలుస్తుంది.

రామూ: (లేస్తూ) ప్రక్క చూపిస్తా రండి... పడుకొందురుగాని.

సుబ్బా: ఇదుగో వచ్చేస్తున్నా ... మీరొండుకొన్నాది కాస్త నేనే తినేసినట్లుంది. క్షమించండి...కాని మీరు విచారించాల్సిన అవసరమేమీ లేకుండా చేస్తాను.

రామ: అదేంమాటలెండి! ... ఉన్నదానిలో టపినమటుకు ... మా ఆకలన్నా తీరితే సంతోషం.

(రామయ్య ముందు, సుబ్బారావు వెనుక మెల్లెక్కి గదిలోకి పోతారు. అక్కడ సంభాషణ.)

రామ : మంచినీళ్ళు ఆ మూలనున్నై. ఇంకే మన్నా కావాల్సొస్తే ఎప్పుడైనా పిలవండి. నేను సగం మెలుకువగానే ఉంటా.

సుబ్బా : ఓ! దానికేంలెండి! .... వెళ్ళండి పాపం మీ కాలస్యమౌతున్నట్లుంది!

రామ : దీపం ఉంచేదా!

సుబ్బా : వద్దు! నాకు పూర్తి విశ్రాంతి కావాల్సొచ్చినప్పుడు చీకటి గదిలోనే నిద్రపోతా. ఎంతో హాయిగా ఉంటుంది.

రామ : సరే....

రామయ్య : గదిలోనుండి ఇవతలికొచ్చి మెట్లు దిగుతాడు. నర్సమ్మ ఇంట్లోకి వెళ్తుంది. రామయ్య కుర్చీలో కూర్చుంటాడు.)

రామ : (మల్లమ్మతో) ... బాగున్నాడా?

మల్ల: ఎవరు?

రామ : అతిథి.

మల్ల : దేనికి?

రామ : దేనికైనాను.

మల్ల : ...డబ్బున్నదంతే. సన్నగ గిడసబారిన ఒంటి ఊపిరివాడు. గుప్పెడుమనిషి, నీకుమల్లేనే.

రామ: (లేచి చెయ్యిపట్టుకొంటూ) ఏమన్నావ్?

మల్ల : (విదిలించి కుర్చీలోకి తోస్తూ) జాగ్రత్త! చెయి చేసుకొన్నావాంటే ప్రాణాలు తీసేస్తా! (రామయ్య కుర్చీలోకి కూలబడతాడు.)

(మల్లమ్మ : బల్లమీద కూర్చొంటుంది. నరసమ్మ కొంతసేపటికి ప్రవేశిస్తుంది.)

నర : ఏంతెచ్చారు?

రామ : నా బొంద! తిరిగినవాడ్ని తిరిగినట్లే ఉన్నా. ఒక్కచేపైనా వలలో పడలేదు; ఒక్క పిట్టన్నా దొరకలేదు.

నర :...రోజులు గడిచేట్లు లేదు.

రామ : ఆకలి దహించుకుపోతున్నది ... ఈ కొంపలో ఏనాడూ కడుపునిండా తిండే ఉండదు. ఛీ ఛీ ఛీ! ఈ వ్యవసాయంతో బ్రతకటమేకాదు!

నర : వండిందికాస్తా ఆయనకే పెట్టేశాను. ధనవంతుడని ముందే ఊహించా...ఒకవారం రోజులకు సరిపొయ్యేడబ్బన్నా ఇచ్చిపోతాడు.

రామ : ఆ తరువాత?

నర : ఇన్నాళ్ళూ గడవలేదూ?

రామ : గడవకేం? ఐదు ప్రాణాల్లోనాలుగు పోయి ఒకటి మిగిలింది. ... ఛీ ఛీ నావల్ల కాదిహ ... నేనూ పట్టణమెళ్ళిపోతా, అక్కడ డబ్బుంది! ఆఖరి కారిణా లాక్కొన్నా సాయం కాలానికి రెండు రూపాయలు కండ్ల చూడచ్చు... రక్తమాంసాలన్నీ ధారబోసి మీ ఇద్దరి కోసం నే నీ బానిస బ్రతుకు బ్రతకటం దేనికంట? నాకు కలుగుతున్న లాభమేమిటి, ప్రయోజన మేమిటి? ... ఆ గడియారం చూడు. వాడిక్కడుండటమేం? మన మిట్లా ఉపవాసాలుంటూ మాడి చావటమేం! దానితో యాడాది వెళ్తుందే ...... అసలువాడి కదెట్లావచ్చింది? ఎవరతడు? అట్లా దేనికి మాట్లాడా డంట?

నర : ఎవరో జమిందారు కావాలి.

రామ : జమీందారుకాదు చట్టుబండలూ కాదు. పిచ్చివాడు! లేకపోతే అడవిలోపడి నడవటం సరదా ఏమిటి నా పిండాకూడు! పైగా సిల్కులాల్చీ, జరి కండువాతో కూడాను.

మల్ల : ఆయన రావటం ఎవరూ చూడలేదు.

నర : పిచ్చివాడైతే మనింట్లో ఉంచినందుకు బహుమానం దొరుకుతుంది, వాళ్ళ తలిదండ్రులు భాగ్యవంతులై యుండాలి.

రామ : అబ్బే పిచ్చనికాదు నా ఉద్దేశ్యం ... చాదస్తమని. ఏదో దయ్యంపూని అతని ప్రేరే పిస్తున్నది. లేకపోతే ఇక్కడికి దేనికంట రావటం? ఆమాట, ఆ ధోరణి ... అడబ్బంతా ఆయవదేనా అసలు?

నర : ... ఆయనది కాకపోతే ... (మల్లమ్మ-నరసయ్య ఒకరి నొకరు చూచుకొంటారు.)

రామ : దొంగవాడల్లె కనపడ్డాడు.... ఔను, పూర్తిగా దొంగవాలకమే వాడిది. తప్పకుండ ఎత్తుకొచ్చుండాలి. పారిపోతూ పారిపోతూ ఇక్కడ దాక్కున్నా డన్నమాట! అందుకే అడవిలో అడ్డంగాపడి వచ్చుంటాడు.

మల్ల : ఇక్కడున్న ట్లెవ్వరూ ఎరుగరు.

నర : దొంగే ఐతే ... పోలీసుల కప్పగిస్తే కనీసం బహుమానమన్న గిట్టుతుంది.

రామ : (గడియారం తీసిచూస్తూ) బంగారు గడియారం! ఆ డబ్బు! ... వాడికేం అధికార ముంది? ఈ దొంగతనాలు చేసే దారులుకొట్టి ఎంతమంది కొంపలు తీసాడో! ... దొంగల్లేనే కనబడ్డాడు నాకు మటుకు.

మల్ల : అర్భనాకారల్లే ఉన్న గుప్పెడు మనిషి...

రామ : ప్రొద్దుట్నుంచి సాయంకాలందాకా కృషి చేసి మిమ్మల్నిద్దర్నీ పోషిస్తూంటే నాకు కలుగుతున్న ఉపకారమేమిటి? ... కటిక ఉపవాసాలు ... దొంగతనాలుచేసి పరుల నోర్లు కొట్టేవాడు పూలరంగడల్లే చీకూచింతా లేకుండా ఉన్నాడు! .... దేవుడనేవా డొక్కడుంటే ఈ అన్యాయం జరగ నిస్తాడా? .... ఆ డబ్బుమీ దాయనకెం తధికారముందో మనకూ అంతధికారముంది.

నర : అరవకండీ వింటాడేమో!

రామ : విననీ! ఎప్పుడైనా సత్యం వినటంఎందుకైనా మంచిది.

మల్ల : లేస్తాడు, జాగ్రత్త.

రామ : ఏంలేస్తే? ... వచ్చేట్లైతే ఇట్లాగే దిగిరావాలి. (మల్లమ్మ-నరసయ్య ఆతనివంక నిండుగా చూస్తారు.) .... అట్లాచూస్తారుదేనికి? (నిశ్శబ్దం.) రోజులెట్లా గడుస్తయ్యాఅని.

నర : ... చలికాలమెట్లా గడుస్తుందా అని.

రామ : భగవంతుడికి తెలియాలి.(మళ్ళా తదేక దృష్టిలో చూస్తూంటారు.) అట్లా దేనికంటచూస్తారు నావంక? (నిశ్శబ్దం)

మల్ల : ... నాకు తెలుసు.

రామ : ఏమిటి ?

నర : మన కష్టాలన్నీ గట్టెక్కే మార్గం ... సాహసేలక్ష్మి

రామ : (చప్పరిస్తూ) మీ ఉద్దేశ్యం ...

నర : సాహసించాలి.

రామ : (గుర్తిస్తూ) .. అంటే... (నరసమ్మ సంజ్ఞాపూర్వకంగా చూపుతుంది.)

మల్ల : ఔను.

రామ : బాబోయ్! నావల్లకాదు.

మల్ల : ఒక్కసారి నాన్నా!

రామ : వద్దు...వద్దు, నాచేతకాదు.

నర : మహా చక్కగా ఔతుంది......మీరే అంటిరిగా ఆ డబ్బుమీద మనకూ అంత అధికార మున్నదని?

రామ : ఔననుకో...కాని నాతల తిరిగిపోతున్నది....ఛీ ఛీ అటువంటి పనా? అసాధ్యం.

మల్ల : మేముకూడ సహకరిస్తాం పద.

రామ : వద్దు! మహాపాపం.

నర : ఓహో!......పాపపుణ్యాలన్నీ ఆ ధర్మ రోజుల్లోనండీ; కళ్ళూ చెవులూ ఉన్న దేవుడుండే కాలంలో!...క్షుద్బాధ తీర్చుకోడాని కేం చేసినా పాపంకాదు. విశ్వామిత్రు డంతటివాడు కుక్క మాంసము తిన్నాడు.

మల్ల : ...నువ్వేమన్నావో జ్ఞాపకం చేసికో నాన్నా!

రామ : ఔను...కాని ఆగండి..........కాస్తాలోచించుకోనివ్వండి...రేపటిదాకానన్నా ....

నర : కాదు, ఇప్పుడు.

రామ : ఇప్పుడా ??

మల్ల : ఔను.

రామ : మన అతిథికూడాను.

నర : గజదొంగ కూడాను...ఒక్కసారి సాహసించండి...గాఢనిద్రలో ఉన్నాడు. కదలకండా మేము పుచ్చుకొంటాం......వచ్చినట్లు, ఉన్నట్లు ఎవ్వరికీ తెలేదు...ఆడబ్బు మనకెంతో అవసరం.

(మల్లమ్మ లాంతర దీపం వెలిగిస్తుంది; నరసమ్మ కత్తి నొకదాన్ని వెతికి తెచ్చిస్తుంది; రామయ్య కొంత సేపు సంకోచించి వాటి నందుకొంటాడు. మెల్ల మెల్లగా మెట్లెక్కుతాడు నరసమ్మ మల్లమ్మ కూడా వెళ్ళబోతారు.

రామ : ఆగండి. మీరెవ్వరూ రానక్కర్లేదు... నేనొక్కడ్నే వెళ్ళి పూర్తిచేసొస్తాను. (ఇద్దరు క్రిందే ఆగుతారు. రామయ్య పైకెళ్తాడు. కొంత కాలం నిశ్శబ్దం. పైన అడుగుల చప్పుడు. కొంత సేపటికి రామయ్య మెట్లపైన కనబడతాడు తూలుతూ క్రిందకిదిగి కుర్చీలో కూలబడతాడు. కత్తి బల్లమీద పడేస్తూ. మల్లమ్మ కత్తిని గమనించి చూసి)

మల్ల : (నరసమ్మతో) కత్తి శుభ్రంగా ఉంది.

న : చెయ్యలేదాండీ !

మల్ల : ఏం జరిగింది ?

రామ : నేను...నాకు—లేదు ! ముచ్చమటలు పోసినై. చెయ్యలేకపోయినా ! ...అసలు లోపలికూడా వెళ్ళలేదు...పగలంతా పనిచేసి అలసిపోయున్నా. జ్వరమొచ్చినట్లుంది. నావల్ల కాదు.

నర : (బిగ్గరగా) చేసితీరాలి !

రామ : (బిగ్గరగానే) నాచేత కాదని చెప్పుతుంటే! ఈ పరిస్థితిలో ఈగనుకూడా చంపలేను. (జేబులు తడుముకొంటూ) చిల్లర డబ్బులునై౨. ఒక ముంతకల్లన్నా తాగితే ప్రాణం కుదుటబడుతుంది. అప్పుడెంతమందినైనా పొడిచేస్తా (వెట్టినవ్వు) రామయ్య ప్రతాపం అప్పుడు చూడాలి...పేగులు మాడి కడుపు వీపుకు తాకుతూంటే నేనేం చేసేది? (పోతూ) ఉన్నవాడ్ని ఉన్నట్లు తిరిగొస్తా. దిగులు పడకండి. (నవ్వుతూ) వాడికీ లోకంతో ఋణం తీరిపోయింది (నవ్వు). వెళ్ళిపోతాడు నరసమ్మ మల్లమ్మ కిటికీలోనుంచి బయటకు చూస్తూంటారు. కొంత సేపటికి తిరిగొచ్చి మల్లమ్మ కుర్చీలోకూర్చొంటుంది; వెలుగుతున్న లాంత రార్పుతుంది. నరసమ్మ కత్తితీసి జాగ్రత్త చేస్తుంది.)

మల్ల :...నాన్నకి గుండెలు లేవు.

నర : అబ్బే ! చాల్లేవే !

మల్ల : లేవు...వట్టి పిరికివాడు.

నర : ఏమీ కాదు. నాకు తెలుసు. ఆయన కాలోచన జాస్తి. నువ్వర్థం చేసికోలేవు...ఆ కాస్తకల్లు కడుపులో పడితే ఆలోచనల్లోని నిమిత్తం లేకుండా ఆ పని జరుగుతుంది.

మల్ల :...త్రాగుడు జ్ఞాపకమొచ్చి తిరిగొస్తే పనులు జరిగినట్లే.

నర : అసలు మనమాటలువిని పనిచేస్తాడని నాకు నమ్మకం చాలలేదు.

మల్ల : చెయ్యడు. చెయ్యలేడు కాబట్టి...... ఒళ్ళుపై తెలియకుండా తాగి ఎక్కడో పడుంటాడు.

నర : అన్నిడబ్బు లెక్కడేడ్సినై లే......ఎందుకెళ్ళాడో మరచిపోడు.

మల్ల : తప్పించుకు బయటపడడాని కెళ్ళాడు. ఇంకెందుకు ? (నిశ్శబ్దం) ఈ కనిపెట్టుకూర్చోటం మటుకు చెడ్డకష్టం.

నర : ఆగు మల్లమ్మా !...రాంగానే ఆపని చేసేస్తాడు. మనకష్టాలు గట్టెక్కుతై. (గడియారం చూస్తూ) దొంగేనంటావా ?

మల్ల : ఐతే మనకేం! కాకపోతే మనకేం !... డబ్బు చేతికిరాంగానే ఇక్కడ్నించి ఎగిరిపోదాం.

నర :...ఎక్కడైనా ఇంతే! ఉపవాసాలు తప్పుతై యేమోకాని !

మల్ల : (నిశ్శబ్దం)...ఈ కూర్చోటం మటుకు దుర్భరం...వెంటనే చెయ్యాల్సినపనుల కాలోచనేమిటి...కష్టాలు పెంచుకోడానికితప్ప ?

నర : (కిటికీలోనుంచి చూస్తూ) బయట వెన్నెలెంతో హాయిగా ఉంది...(హఠాత్తుగ) ఆయనక్కడ కూర్చొన్నప్పుడెవరూ చూడలేదుగద !

మల్ల : బయటనుంచంత స్పష్టంగా కనిపించదు.

నర : ఐనా రాత్రివేళ ప్రక్కకెవరొస్తార్లే.

మల్ల : ఎవరన్నా రావచ్చు......అప్పుడప్పుడొస్తూంటారు.

నర : మహావచ్చారు లేవే, భూలోకసుందరొక త్తె యీఇంట్లో ఉన్నదని !

మల్ల : నన్నుచూస్తే నీకెందుకంట, అంత మప్పనాతితనం ?

నర : నా కా!...నీఈడులో కిటికీదగ్గర నిలబడితే, ప్రతివాడు పని గల్పించుకొని అటూఇటూ పదిసార్లు తిరిగిపొయ్యేవాడు.

మల్ల : ఒయబ్బా ! పాపం ముసలిదానివై పోయినావు కాబోలు....

నర : పడుచు దానివై నువ్వేం వెలగబెట్టావు చెప్పు......అసలు నన్నుచూస్తేనే నీకు గిట్టదూ! ......నీతల్లినన్న గౌరవంకూడా లేదు. నీకు మల్లే తల్లుల్నెవరూ ఆడిపోసుకోరు. నీది విపరీత ప్రకృతి.

మల్ల : నేనంటే గిట్టదు ! పైగా ఓర్వలేవు!.... కావటం నాతల్లివే, నన్ను కన్నావుగాబట్టి......

నర : కనటం సంగతి నీకేంతెలుసే పిచ్చిపిల్లా! ...నీజన్మకాగితేలేదు. (ఈ సంభాషణ చివరిలోనే సుబ్బారావు మెట్లపైన కనుబడతాడు. మెల్లమెల్లగా దిగివస్తాడు. కిందికి వచ్చేప్పటికి మల్లమ్మ నరసమ్మ గమనించి ఉలికిబడతారు )

నర : ఏమన్నా కావాలండీ!

సుబ్బా : అబ్బే ! ఏంలేదు......రామయ్యగారు లేరూ ?

నర : లేరు. ఇప్పుడే బయటికెళ్ళారు.

సుబ్బా : అట్లాగా !

నర : ...మాగల్లంతుతో నిద్ర చెడిపోలేదుగద?

సుబ్బా : అబ్బే !...చూడండి...నాకు...నేను ...ఆయనతో మాట్లాడి పోదామనుకొన్నా... ఇవ్వాళ్ళరాత్రే చెప్పేద్దామనుకొన్నా...పోన్లెండి మరేం ఫరవాలేదు.

నర : ముఖ్యమైన పనేమన్నాఉందా ?

సుబ్బా : అ, అంత ముఖ్యమేముందిలెండి?... ఎప్పుడొస్తారు ?

నర : నే నెరగను...చెప్పిపోలేదు.

మల్ల : రెండు మూడుగంటలు కావచ్చు... చాల ప్రొద్దు పోయింతరువాత కాని ఇంటికి రావటం మామూల్లేదు.

సుబ్బా : అట్లాగా !...పోనీండి. రేపు ప్రొద్దునే చెప్పచ్చు.

నర : (గబగబా కిటికీతలుపులు మూసేస్తూ) చలిగాలికూడా వీస్తున్నది.......నన్నేమన్నా చెప్పమంటారా ఆయనకు ?

సు : ....వద్దులెండి .......ఆయనకూడాఉంటే ఇప్పుడే చెప్పుదామనుకొన్నా ! రేపైతేమాత్రం మునిగిపొయ్యేదేముంది ? .... రేపేచెప్తా.

నర : ....... మా గల్లంతువలన నిద్రాభంగమయిందికాబోలు.

సుబ్బా : పడుకొన్న వెంటనే నిద్రపోయినా.... ఎందుకో హఠాత్తుగ మెలుకువవచ్చింది....విషయం చెప్పి కాని నిద్రపోకూడదనిపించి.... అసలు మళ్ళా నిద్రేపట్టలేదు....... తెల్లవారేదాకా ఉండబట్టలేక కిందకొచ్చాను.... మరేంపరవాలేదు. రేపటిదాకా ఉన్నా చెడిపొయ్యేదేముందికనుక ?

నర : .... ప్రొద్దుపోయింది, వెళ్ళిపడుకోండి.... అలసిపోయున్నారు. నిద్రదే పట్టుతుంది.

సుబ్బా : ఔను. క్షమించండి. మీక్కూడా ఆలస్యమౌతున్నది. (మెల్లమెల్లగా మెట్లెక్కి గదిలోకి పోతాడు.)

నర : ....ఆయనుద్దేశ్యమేమిటి ? ఎందుకొచ్చాడంట క్రిందకి ?

మల్ల : నాకుమటు కేంతెలుసు ?

నర : ....విన్నాడా కొంపతీసి !

మల్ల : నాకు నమ్మకంలేదు......జరుసుకొని లేచాడు కాబోలు.

నర : పిచ్చివాడేనేమో కర్మం !

మల్ల : మాట, ధోరణి, ప్రవర్తనమటుకు చిత్రంగానేఉన్నై.

నర : ఏంచేద్దాంచెప్పు ?

మల్ల : ....మళ్ళావస్తాడంటావా ?

నర : వస్తే మరీచెడుతుంది వ్యవహారం ........ అన్నిటికీతగ్గట్లు వెట్టికూడాఉంటే ఐనట్లె. (తలుపు చప్పుడు. ఆదుర్దా పడిపోతారు. మల్లమ్మ గడియారం తీసుకొని లోపలికెళ్తుంది. నరసమ్మ కోటు దాచేసి తలుపుతీస్తుంది:) ఓహో! నువ్వేనా నాగులూ! రా. (నాగులు ప్రవేశం) ప్రొద్దుపోయొచ్చావు?

నాగు : ఎనిమిదిన్నరేగా ఐంది?........ ఒకసారి చూసిపోదామనొచ్చా.

నర : ఇప్పుడే పనితీరింది. ఇల్లు అవి కడుక్కొని ఇవతలికొచ్చా.

నాగు : (గుమ్మడికాయమూట నందిస్తూ) మీ కోసమే తెచ్చింది.

నర : (విప్పిచూచి) .... మమ్మల్నొకకంట కని పెడుతూనే ఉంటావు నాగులూ నువ్వెప్పుడూ !.... నుంచొనేఉన్నావేం ? కూర్చో.

నాగు : (కూర్చొంటూ) కులాసా ?

నర : అదేకులాసా .... ఇట్లాఉన్నాం (లోపలి కెళ్తూ) ఆగు లోపల కాస్త పనుంది .... మల్లమ్మ వస్తుందికూర్చో. (నరసమ్మ లోపలికెళ్తుంది. కొంత సేపటికి మల్లమ్మ ప్రవేశిస్తుంది.)

నాగు : ఏం మల్లమ్మా?.... నల్లపూసవైపోయినావు.

మల్ల : నే నెక్కడ కనబడతానులే నీకంటికి !

నాగు : ఏం ?

మల్ల : బొత్తిగా రావటమే మానేసేవుగా!.... నీకెక్కడలే .... నేనొక్కత్తెనే కావాలొచ్చానా ఏం !

నాగు : తల్లితోడు !.... ఇంకెక్కడికన్నా వెళ్తే ఒట్టే ! ... పనివత్తిడివల్ల తీరికేఅవటల్లేదుమల్లీ...ఏ రోజుకారోజు బయుల్దేరుతూనేఉన్నా ఏదో పనడ్డమొచ్చి ఆగాల్సొస్తున్నది.

మల్ల : ఇప్పటికి తీరికైందన్నమాట !

నాగు : ఎక్కడైంది ! అట్లాగే అవకాశం కల్పించుకొచ్చా.

మల్ల : ...చూడునాగులూ! అమ్మతలుపులేసేసే ప్రయత్నంలోఉంది. తరువాతెప్పుడైనా రా.

నాగు : అప్పుడే !! ఊరు నాలుగుమూలలా ప్రొద్దుగుంకనన్నా లేదు.

మల్ల : త్వరగా పడుకోటమే మాకలవాటు... ఈవేళప్పుడు పూర్వం రాలేదుకాబట్టి నువ్వెరగవు.

నాగు : చాల్లెద్దూ.

మల్ల : పైగా నే నలసిపోయున్నా. నాగులూ వెళ్ళు నీపుణ్యం !

నాగు : ...ఇవ్వాళ్ళ పొలానిక్కూడా రాలేదుగా !

మల్ల : ఎవరన్నారు?

నాగు : నేనేపోయి చూసొచ్చా.

మల్ల : ....ఔను వెళ్ళలేదు....ఇంత రాత్రివేళ నువ్విక్కడుంటే ... ఎవరన్నా ఏమన్నా అనుకొంటారు... వెళ్ళు.

నాగు : కొత్తగా అనుకోడానికేముంది చెప్పు !

మల్ల : చాల్లెద్దూ...తరువాతెప్పుడన్నా మాట్లాడుకోవచ్చు...రేపురా, సాయంకాలం. (కాస్సేపాగి, హఠాత్తుగా) వెళ్ళమని చెప్పటంల్లా?

నాగు : (కళ్ళు పెద్దవిచేసి చూసి కొంతసేపటికి బుజాలమీద చేతులేస్తూ) మల్లీ! దేనికట్లా అరుస్తావు?

మల్ల : (తప్పించుకొంటూ) మళ్ళీ ఎప్పుడైనా వద్దువుగాని వెళ్ళు.

నాగు : ...వారం రోజుల్నించి ప్రయత్నిస్తున్నాను... మొన్నటిదాకా ముసురువానలూ, నిన్న విత్తనాలకోసమనెళ్ళొచ్చా... (చెయ్యి పుచ్చుకొంటూ) మల్లమ్మా ! నీ కోసమే ఇంతదూరం వచ్చింది.

మల్ల : (విదల్చుకొంటూ) నాకు తెలుసు... కాని వెళ్ళిపో నాగులూ !

నాగు : (కూర్చొంటూ)...నా ఇష్టమొచ్చినంత సేపు కూర్చొంటా. నా బుద్ధిపుట్టినప్పుడు వెళ్ళిపోతా.

మల్ల : ఒహో! నా మాట వినిపించుకోవన్న మాట.

నాగు : ఏం వినిపించుకోకపోతే ?...ఏం చేస్తావేం ?

మల్ల : (అమాంతంగా చెయ్యిపుచ్చుకొని తేవ తీసి) పోతావా పోవా ?

నాగు : (రెండవ చెయ్యి పట్టుకొని దగ్గరకు లాగి కౌగలించుకొంటూ) అంత బలవంతురాలి వెప్పట్నుంచీ అయినావ్ పిల్లా! (ముద్దుపెట్టుకొంటాడు. మల్లమ్మ నిశ్చేష్టురాలై కౌగిట్లో ఒక క్షణం నిలుస్తుంది. తరువాత, జ్ఞాపకమొచ్చి వెనక్కు తోస్తుంది. కుర్చీలో కూలబడతాడు.)

మల్ల : (ఆప్యాయంగా) వెళ్ళు నాగులూ! నీకు పుణ్యముంటుంది...నా మాట విను.

నాగు : (నిండుగా ఆమెను చూస్తూ) సరే మల్లమ్మా!...రేపొస్తా మళ్ళీ.

మల్ల : తప్పకుండా రా! నీకోసం కనిపెట్టుకొనుంటా...అన్నీ సవ్యంగా సాగితే రేపొక శుభవార్తకూడా చెప్తా!

నాగు : (చెయ్యి పట్టుకొంటూ) నిజంగానా! (మల్లమ్మ తలూపుతుంది) ఐతే పెందరాడే వస్తాను... వెళ్ళొస్తా (నాగులు నిష్క్రమిస్తాడు. నరసమ్మ ప్రవేశిస్తుంది)

నర : అమ్మయ్యా వదిలాడు మొత్తానికి!... ఎంత సేపటికీ కదలందే.

మల్ల : ...పాపం! నాగు ఉట్టి అమాయకుడు.

నర : ఔను. లేకపోతే నన్ను చూసికూడా మతి పోగొట్టుకో...

మల్ల : ఛీ నోర్ముయ్! వాగావా అంటే గొంతు పిసికేస్తా! (నిశ్శబ్దం)

నర : ...నాగు ఉండగా ఆయన దిగొచ్చినట్లుంటే ఏమయ్యేది ?

మల్ల : మనాట కట్టేది.

నర : ...ఆలస్యమైతే అమృతం విషమౌతుంది...ఇంతసేపెక్కడి కెళ్ళినట్లు!...ఎవరన్నా వస్తే అనవసరంగా బయటబడిపోతాం.

మల్ల : ......అత్యవసరంగా నా కా డబ్బు కావాలి!!...ఈ వూరుమీద నాకు విరక్తి పుట్టిపోయింది. ఈ గానుగెద్దుల జీవితంతో విసుగెత్తింది...పట్టణానికెళ్ళి దర్జాగా బ్రతకచ్చు!

నర : నీలోటివాళ్లనెవరు చూస్తారే అక్కడ!... నాజూకు మనుష్యులు కావాలి కానీ!

మల్ల : డబ్బుంటే అన్నీ నాజూకులూ అవ్వే వస్తై.

నర : ఓహో!

మల్ల : నీకు పరాచకంగా ఉందన్నమాట! ఔనుమరి!...మీ రిద్దరుచేరి నా జీవితాన్ని పొట్టనబెట్టుకొన్నారు... నా తోటివాళ్ళు చూడెట్లా ఉన్నారో! ఇరవై ఐదేళ్ళు శరీరంమీది కొచ్చినై, ఒక మంచి చీరెకాని, రవికకాని కొనిచ్చారా! కనీసం కొంపలో ఏపూటన్నా తృప్తిగా భోజనం చేసే యోగ్యత, అదృష్టమూ ఉన్నదా?...ఎందుకొచ్చిన బ్రతుకు!

నర : ఆ గీతే ఉంటే ఇంకొక అమ్మ కడుపునే పుట్టేదానివి.

మల్ల : మీరు చాలక ఈ బావిస సంతానం కూడా దేనికి? రెండు పొట్టలే పూడనప్పుడు మూడవ నోరుకూడా దేనికి?...తరతరాలనాటి కుంటన్నర దున్నుకొంటూ రోజులు వెళ్ళతియ్యాక పోతే, ఏ బస్తీకన్నాపోయి సంపాదించుకు రాకూడదూ?

నర : నీ ఉద్దేశం, చెట్ల క్కాస్తుందనా బస్తీలో డబ్బు!

మల్ల : భూగర్భంలో ఉన్నానరే పెల్లగించాలి.

నర : కానియ్యిమరి!

మల్ల : అది మగవాళ్ళపని.

నర : (నవ్వి) అంతే...సమయాని కేదో వకటి చెప్పి అంతా తప్పించుకొంటారు.

మల్ల : నాన్న వెళ్ళి గంట దాటింది.

నర : ఔనే....ఇంతసేపేం చేస్తున్నాడంట ?

మల్ల : త్వరగా వచ్చి ఈ పని చేసితీరాలి...

నర : (హఠాత్తుగ) — ఆగు ! (జాగ్రత్తగా వింటుంది.)

మల్ల : ఏమిటది ?

నర : చప్పుడైంది దేమిటి ?

మల్ల : ఎక్కడ ?

నర : బయట.

మల్ల: నాకేం వినబడందే.

నర : ఆయనే నేమో !

మల్ల : (కిటికీలోనుంచి చూస్తూ) ఎవరూ లేరు.

నర : ఏదో చప్పుడైంది మొత్తానికి...ఇతడు లెవ్వరూ కారుగద కొంపతీసి !

మల్ల : ఏం కాదు. అది కేవలం నీ భ్రాంతి.

నర :...ఈసారి కూడా ఆయన సాహసించక పోతే ప్రమాదం !

మల్ల : నాన్న వట్టి పిరికివాడు...నా కప్పుడే తెలుసు; తప్పించుకు బయటబడే మార్గం వెతుక్కుంటున్నాడని.

నర : అటువంటివారేం కాదు ...... ఇప్పుడే వస్తారు.

మల్ల : ఏడీ మరి ?? (నిశ్శబ్దం)

నర :...ఈ కని పెట్టుక్కూర్చోటమంటే ప్రాణం మీదికొస్తుంది...నాకు మహా చెడ్డచిరాకు.

మల్ల : నాన్న రాడు......ఆ పని చెయ్యడు; చెయ్యలేడు—(కత్తినితీసి చూస్తూ)....ఈ కత్తి చాల అల్పంగా ఉంది. బలవంతంగా వంచితే విరిగి పొయ్యేట్లుంది.

నర : వాటిక[illegible]లి నీకెందుక్కాని కూర్చో !

మల్ల : (బిగ్గరగా) కూర్చొని కూర్చొని పిచ్చెత్తి పొయ్యేట్లుంది......(కట్టెలచాటున వెదికి గండ్ర గొడ్డలిని పెల్లగిస్తుంది. విమర్శగా చూచి)....అంత పదునుగా లేదు కాని, బరువుగా మటుకుంది.

నర : దేనికీ...దేనికంట ??

మల్ల : (దీపం వెలిగిస్తూ)...మనమే పూర్తి చెయ్యాలి.

నర : చాల్చాల్లే ! మనకేం చాతౌతుంది ?

మల్ల : మహా చక్కగ చేతౌతుంది....చేసితీరాలి. గుప్పెడు మనిషి. (పళ్ళు కొరుకుతుంది) దుప్ప టాయనమీద పడేసి చేతులు కదలకుండా పట్టుకో. తరువాతపని నేను పూర్తి చేసేస్తా. (ప్రక్కలో దుప్పటి తీసి ఆమెమీదికి విసరుతూ) సాహసే లక్ష్మీ అన్నారు !

నర : (కొంతసేపు సంకోచించి) త్వరగా కానియ్యి తే....పదా !

(మల్లమ్మ వీధితలుపు, కిటికీతలుపు వేసి లాంతరు గొడ్డలి పుచ్చుకొని మెల్లగా బయల్దేరుతుంది. నరసమ్మ ముందర వణకిపోయి కొయ్యబారుతుంది. కొన్ని మెట్లెక్కి మల్లమ్మ తిరిగి చూస్తుంది నరసమ్మ మనస్సు ధృఢం చేసికొని అడుగులు ముందరికేస్తుంది. మల్లమ్మ దీపం అందించి ఇద్దరూ కలసి వెళ్తారు. అలజడి. కొంతసేపటికి గొడ్డలితో కొట్టిన మోత. 'అమ్మో. అయ్యో' అని అరుపులు మళ్ళా రెండుతడవలు గొడ్డలి దెబ్బలు. 'అమ్మా' అని బిగ్గరగా అరపు. గొడ్డలి దెబ్బలు వినబడుతూనే ఉంటై. నరసమ్మ 'ఆగు, ఆగు నీపుణ్యం' అంటూంటుంది. కొంతసేప టికి ఆమె రొప్పుతూ, తూలుతూ ఇవతలికొస్తుంది. జారుతూ మెట్లుదిగి క్రింద మెట్టుమీద కూలబడి పడుస్తూ)

నర : అది నాకూతురు కాదు. పిశాచి...మనిషి కాదు. రాక్షసి! (కొంతసేపటికి గొడ్డలి దెబ్బ లాగి పోతై. తరువాత మల్లమ్మ గొడ్డలి వ్రేలాడేసు కొంటూ నిశ్చలంగా మెట్లు దిగొస్తుంది. అలసి పోయినట్లు శ్వాసమటుకు దీర్ఘంగా తీస్తుంది. గది మధ్య కొచ్చేప్పటికి నరసమ్మ పరుగెత్తుకొంటూ వచ్చి ఆవేశంగా మల్లమ్మ బుజాలమీద చేతులేసి ఊగిస్తూ)

నర : చచ్చిపోయింతరువాత కూడా ఎందు కట్లా చితక్కొట్టావు? నువ్వు మనిషివా పశువ్వా!

మల్ల : ....ఏమో!...వళ్ళు తెలిసింది కాదు.

నర : (కుర్చీలో కూలబడుతూ) ఆగమంటే ఆగితేగా!...పిచ్చెత్తి పోయిందనుకొన్నా.

మల్ల : ఔను, పిచ్చే ఎత్తిపోయింది.

నర : (ఏడుస్తూ) అమ్మా అమ్మా అని వాపోయ్యాడుకూడా నేపాపం !

మల్ల : ఏమీ అనలా !

నర : నీకెక్కడ వినబడుతుంది లేవే...బ్రహ్మరాక్షసల్లే చిత్రవధ చేసావ్... ...పాపం వాళ్ళమ్మెక్కడుందో ! మనం చేసిందాతల్లికి తెలిస్తే... ఛా ఛా అన్యాయంగా నిండుప్రాణాన్ని పొట్టనబెట్టుకొన్నాం......వజ్రంతో చెయ్యబడ్డ దేహం కూడా నీదెబ్బలకు పిండిపిండై పొయ్యేది.

మల్ల : ...ఆవేశం పట్టలేకపోయినా.

నర : నిన్నుచూసి నేనే వణికిపోయినా ! నాకూతురివనిపించలేదు... దయ్యానికి మళ్లె పూనకమొచ్చినట్లు వాడిమీద బడ్డావు....నిన్ను చూస్తే నాకసహ్యామేసి పోయింది.

మల్ల : ఏం చేసానో నాకు తెలేనే తెలేదు.

నర : (గొడ్డలిని సూచిస్తూ) ఇంకా పుచ్చుక్కూర్చొన్నావు దేనికి !...ఇంకా ఎవరిప్రాణాలు తియ్యాలి? (గొడ్డలి కట్టెలవెనుక పారేసొస్తుంది )

నర : ఆదుప్పటి నేను ముట్టుకోను, ఆగదిలోకి నేనిహ వెళ్ళను.

మల్ల : ఆ అవసరమే ఉండదు. (ఆలోచిస్తూ స్టూల్ మీదకూర్చొంటుంది. కొంతసేపటికి కళ్ళవెంట నీళ్ళుకారుతై, ముఖానికి చేతులడ్డం పెట్టుకొని దుఃఖిస్తుంది.)

నర : ఏడవబోకు మల్లమ్మా! ఐపోయింది... కదల్లేనికట్టె అల్లే పడున్నాడు. వాడిబాకీ తీర్చేసాం. ఈరాత్రో రేపో పెరట్లో గొయ్యితీసి పాతేస్తారాయన......వాడిసంగతి మరచిపోవచ్చు...... ఇట్లా ఊరువిడిచిపెట్టి పరదేశంపోదాం. ఏపట్టణానికైనా వెళ్ళి ఈధనంతో దర్జాగా జీవించవచ్చు... (మల్లమ్మతో) ఏడవబోకుమల్లమ్మా!...జరిగిందేదో జరిగింది.

మల్ల : ...తలచుకొంటే నాకే ఆశ్చర్యంగా ఉందిసుమా !

నర : తలచుకోటందేనికి ?...ఈ వాతావరణం నుంచి దూరంగా వెళ్ళిపోదాం. అక్కడ సరికొత్త జీవితం మొదలుపెట్టొచ్చు....నీకు మంచి మంచి సిల్క్, జార్జెట్ చీరెలు కొనిపెడుతా ! మహారాణికి మల్లేఉండచ్చు.

మల్ల : ఔను ...నాగులెంతో సంతోషిస్తాడు.

నర : అక్కడ నాగులేకావాలా ఏం ? బోలెడంత మందుంటారు.

మల్ల : వాళ్ళతో నాకేం సంబంధం !...నాకు నాగులేకావాలి...ఈపని చేసింది కేవలం నాగులు కోసమే...మావివాహానికి కాటంకం తీరిపోతుందనే నిండు ప్రాణాన్ని కూడా నిలువునా తీసేసింది.

నర : (బయట అడుగులచప్పుడు విని.) ఇస్ ! ఆగు ! ఎవరో వస్తున్నారు. (కిటికీలోనుండి చూస్తూ, ...ఆయనేనేమో ! సరిగా కనుపించట్లేదు....మల్లమ్మా! సర్దుక్కూర్చో, పరాయివాడైతే జాగ్రత్తగా ఉండాలి ...

మల్ల : జరిగిపోయింది మనమే పూర్తి చేసామని చెప్పెయ్యచ్చు.... నాకేం విచారంలేదు. దరిద్రం వదలిపోయింది ...జీవితశేషమైనా హాయిగా గడచిపోతుంది.

నర :....ఆయనే....కాని .... వెంకట్రావుగారు కాబోలు పట్టుకొస్తున్నారు.

మల్ల : కడుపునిండా తెగతాగాడన్నమాట !

(రామయ్యను పట్టుకొని వెంకట్రావు ప్రవేశిస్తాడు. రామయ్య చేతుల్లోనుంచి క్రిందకి జార్తాడు.)

నర : (ఆదుర్దాగా) ఏం ? ఏమైంది !

వెం : అబ్బే ఏంలేదు ! ఒక ముంతెక్కువ పట్టించాడేమో !....గుళ్ళో అరుగుమీద కూర్చొన్నాం కబుర్లు చెప్పుకొంటూ, దూరాన్నించి

రామయ్యగారొస్తున్నారు. చెప్పులు చేతులో పట్టుకొని నిదానంగా చప్పుడు చెయ్యకండా అడుగులు వేసుకొంటూ తూలుతూ నడుస్తూ అక్కడ కొచ్చేప్పటికి పడేందుకు సిద్ధమైనాడు. పట్టి ఇంటికి తెచ్చాను.

మల్లి : మీకు చాల శ్రమ కలిగించాడు. క్షమించండి.

వెం : మరేంఫరవాలేదులే అమ్మాయి ! తోటి వాళ్ళం మనలోమనకేమిటి? (ప్రసాద్ కాఫీపట్టుకొస్తాడు) రా నాయనా రా, ఇట్లాతే.

ప్రసాద్ : ఏమైంది నాన్నా...

వెం : ఏం లేదులేరా !....నువ్వెళ్ళూ ఇంటికి. (ప్రసాద్ వెళ్ళిపోతాడు. కాఫీ సాసర్‌లో పోస్తాడు నరసమ్మ అందుకొని రామయ్యకు పట్టుతుంది....)

మల్లి : అకారణంగా ఇంత కనికరం పుట్టుకొచ్చింది మామీద !

వెం : అదేమిటి మల్లమ్మా! మీ కష్టసుఖాలు మావికావూ.

నర : ఔనౌను అందుకే మొన్న నానావిధాలా ప్రాధేయపడ్డా రూపాయి డబ్బు లివ్వలేదు.

వెం :నా దగ్గర లేకపోయింది. నేనేం చేసేది !

మల్లి : అదే నేననేది.

వెం : కష్టాలన్నీ తీరేపోటొచ్చిందిగా, ఇంకేం ! (నరసమ్మ, మల్లమ్మ ఉలకిబడుతారు. ఇంతలో రామయ్య కదుల్తూ మూలుగుతాడు. ఆతనివంక చూస్తూ) ప్రొద్దుట్నుంచి ఉపవాసమే కాబోలు అందుకే తాగంగానే తలకెక్కింది.

రామ : ఇస్ ; ... (నిశ్శబ్దంగా, ... చప్పుడు చెయ్యకండా... మెట్లవైపుకు పోబోతాడు.)

నర : ఏమండీ! (ఆపుతుంది. రామయ్య మళ్ళా మూర్ఛపోతాడు.)

వెం : మరేం ఫరవాలేదు. నరసమ్మగారూ! కాస్సేపు పడుకోనివ్వండి ... ఏవేవో పిచ్చిపిచ్చి మాటలాడాడు. రహస్యంగా....పని ముగించాలన్నాడు. తనకేవోఅదృష్టం పట్టబోతున్నదన్నాడు. భాగ్యవంతు డౌతానన్నాడు. (నవ్వుతూ) 'నాకూ తెలుసులెమ్మన్నా. దరిద్రం వదలిపోయింది లెమ్మని అభినందించా.

(మల్లమ్మ నరసమ్మలకు అనుమానం బలపడుతుంది.)

మల్లి : తెలుసా మీకు ?

వెం : తెలీకేం? సంపూర్ణంగా తెలుసు.

నర : మీసంగతి తప్పకుండా జ్ఞాపక ముంచుకొంటాం....మా ఆనందంలో మీకూ భాగముంటుంది.

వెం : మీ ఆనందం మాకానందం కాదుటండీ? అదే మీ భాగ్యం. (చూపుతూ) వేరే భాగాలేమీ అక్కర్లేదు...ఇవ్వాళ్ళ పర్వదినం...పైనున్నాడు కాబోలు.

మల్లి : ఔను.

మల్లి : అలసిపోయినట్లున్నాడుపాపం! సుఖంగా నిద్రపోతున్నాడు.

నర : చూడండీ... విషయమంతా చెప్పారా ?

వెం : మరే (... మొదట్లో నేనే నమ్మలేకపోయినా. దూరాన్నుంచే నన్ను చూచాడు. 'వెంకట్' అని ఎలుగెత్తి పిలిచాడు. మొదట నేను గుర్తుపెట్టలా. పదిహేనేళ్ళ తరువాత కూడా వాడు మరచిపోలా. ఏటి గట్టునకూర్చొని ప్రొద్దుపొయ్యేదాకా కబుర్లుచెప్పుకొంటూ కూర్చొన్నాం. చివరికి తాను చెయ్యదలచిన చమత్కారం చెప్పేసాడు. తెల్లవారంగానే కలుస్తానన్నా ... తప్పిపోయిన కొడుకు ప్రతిరోజు తిరిగి రాడుగదా !

నర : (నిలువునా కూలుతూ) కొడుకు !... కొడుకు !

వెం : (బిగ్గరగా నవ్వుతూ) అయితే అసలు సంగతింకా చెప్పలే దన్నమాట ! (నవ్వు) అమాంతంగా సంతోషమొచ్చినా సంతాపమొచ్చినా తలక్రిందులౌతారు... ఐతే నాటకం చివరిదాకా సాగిస్తున్నా డన్నమాట ! ... వాతో చెప్పాడు. పరాయివాడల్లే ఇంటికెళ్ళి అడవుల్లో దారితప్పి

పోయిందనిచెప్తానన్నాడు. తెల్లవారంగానే పదిహే నేళ్ళ క్రితం మాయమైపోయిన సుబ్బులిడుగో నిజం చెప్పేస్తానన్నాడు.! 'నువెట్లాగూ రహస్యాన్నంత కాలం దాచలేవని' పందెంకాచా!... నేనే ఓడి పొయ్యానన్నమాట! (నరసమ్మ పొంగి పొరలి వస్తున్న దుఃఖాన్ని దిగమింగుకొంటుంది.)

మల్ల : మీకు తెలుసా వాడు ?

వెం : నేనెరగక పోవటమేమిటి మల్లమ్మా... సుబ్బులూ నేను సహాధ్యాయులం. స్నేహితులం. ఎన్నె న్నాటలాడుకొనేవాళ్ళమో కలసి! ఆ ముచ్చట్లే చెప్పుకొంటూ చీకటి పడేదాకా ఏటి ఒడ్డున కూర్చొన్నాం. (మల్లమ్మ కళ్ళు పెద్దవిచేసి చూస్తూంటుంది. వాళ్ళని చూచి) అట్లా వెఱ్ఱిగా చూస్తారేం. రాలా ఇక్కడికి ?

మల్ల : వచ్చాడు.

వెం : అట్లాఉన్నారేం మరి ?

నర : (ఆపుకోలేక, బిగ్గరగా ఏడుస్తూ) 'అమ్మా' అనరచాడుకూడా.

వెం: అరచే ఉండాలి ... పదిహేనేళ్ళ తరువాతామె.

రామ : (మూర్ఛనుంచి లేస్తూ) ఓస్ ! .... ... ఆగండి....గుట్టుగా. పరాయివాడికి తెలియకుండా. చేసెయ్యాలి. (నర్సమ్మ ఏడుస్తూంటుంది.)

మల్ల: ఊర్కో అమ్మా. ఏమిటా ఏడుపు ! (నర్సమ్మ ఇంకా బిగ్గరగా)

వెం : విషయమేమిటో బోధబడటంల్లేదు. అట్లా ఉన్నారు దేనికి ?...ఏం జరిగింది ?

మల్ల : ఏమీలేదు.

వెం : ... రహస్యం బయటబడిపోయింది ... మొత్తానికి వాడు చెప్పనే లేదన్నమాట.

మల్ల : లేదు.

వెం : ఎక్కడున్నాడు ?

మల్ల : పైన (నర్సమ్మ: 'సుబ్బులూ' అని బిగ్గరగా ఏడుపు.)

వెం : ఏమిటి ? ఏమిజరిగింది ? (పైకి చూస్తూ) సుబ్బులూ...సుబ్బులూ (నిశ్శబ్దం)

రామ : (లేస్తూ) ఇస్ ! నిశ్శబ్దం ... చప్పుడు చెయ్యకండా చాటుగా ... (కత్తిఉన్నట్లే చెయ్యి పైకెత్తి మెల్లమెల్లగా మెట్లెక్కుతాడు.)

వెం : (రామయ్యను చూచి హఠాత్తుగా అనుమానిస్తూ) ఏంచేసారు ? ఏంచేసారు ? సుబ్బుల్ని మీరంతాచేరి...చెప్పరేం?

నర్స : అమ్మా, అమ్మా అని వాపొయ్యాడు ! అయ్యో (ఏడుపు.) (మల్లమ్మకూడా ఏడుస్తుంది.)

రామ : (చెయ్యెత్తి ఇటుతిరిగి) అరవకండి ! ...నిద్రపాడైతే ఆటకట్టుతుంది. అరచేతులో పిట్ట తుర్రుమంటుంది.

మల్ల : నాన్నా !

వెం : (సత్యంగుర్తిస్తూ) ఐతే సుబ్బుల్ని మీరు —శివశివా !...(గబగబా పైకి పరుగెత్తుతాడు, రామయ్యను ప్రక్కకుతోసేసి, తల్లికూతుర్లు ఒకరిమీ దొకరుపడి ఏడుస్తారు. రామయ్య వెఱ్ఱిగా చూస్తూంటాడు. వెం : 'సుబ్బులూ' అని బిగ్గరగా అరచి, 'సుబ్బులూ'అంటూ ఏడుస్తూండగా......)

(తెర)

*(రుపర్ట్ బ్రూక్ ఆధారంగా)*

ధూళిపాళ శ్రీరామమూర్తి | # నిర్వేదము

భావించన్ నిను నన్నువంటి దెవదో వైరాగ్యమో భక్తో భీ
తో విశ్వాసమొ కారణంబగుచు నేదో కొంచెమీవంచు ను
న్నావంచున్ నిలువెల్ల నాస్తికముగా నైనట్టి లోకంబులో
నీవున్నావనుటే తపశ్చరణ తంద్రీ రాజరాజేశ్వరా!

గోడన్ వ్రాసిన చిత్రమై జగతిసాగున్ సాగు చిత్రంబునం
దాడున్ మూఢుడు చిత్తజాతవశుడై యారాటముం జెందుచున్
జోడౌ చిత్రములెల్ల గోడయనుచున్ జోడించుకోలేడు క
న్గోడున్ గోడువడున్ సుడింబడు నడంగున్ రాజరాజేశ్వరా!

ఆదింజూడ ననాది సిద్ధమగు నీ యజ్ఞానమే చిత్ర మీ
పాదుంబట్టియె వచ్చె తక్కిన మహావ్యాధుల్ నినున్ వీడినన్
ధీధారాజనిమద్గిరీ! హర! మహాదేవా! భవానీపతీ!
ఛేదింపంగ వలంతి యెవ్వడౌదవున్ శ్రీ రాజరాజేశ్వరా!

తలపన్ వేరొక దెద్దియేని గలదా! దాక్షాయణీనాథ! ని
స్తుల సంసారమహాటవిన్ బొరలగన్ దుఃఖాగ్నిలో మ్రగ్గగన్
కలితానంద వియద్ధునీ ప్రవిలసత్కల్యాణ కల్హారమై
చెలువొప్పంగవలంతి చిత్తమెగదా! శ్రీ రాజరాజేశ్వరా!

ఈ జన్మంబుల నెత్తియెత్తి విసువై యేకారితిన్ ధూర్జటీ
రాజద్రాజ కళాకిరీట రమణీ రమ్యార్ధదేహా! శివా!
ధీ జాడ్యంబు దొలంచి నా యెదద నీ తేజంబు నిండింపవే
ఈ జన్మంబుల గోడదంపవె కపర్దీ! రాజరాజేశ్వరా!

# సంస్కృతరూపకముల అనువాదములు - 2

సుప్రసన్న

మన భాషలో అనువదింపబడిన నాటకములలో ఎక్కువసారు లనువదింపబడిన నాటకము కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము. ఈ నాటకము బహుభాషలలో బహుపర్యాయములు పరివర్తనము పొందినది. కొన్ని గ్రంథములమీద మక్కువ అట్టిది. ఆ గ్రంథమును చదివినవారు, ఆ గ్రంథములోని మహానంద పర్యవసాయియైన రసమునందు మున్కలిడినవారు, ఆ గ్రంథము నాత్మీయముగ నొనర్చుకొన ప్రయత్నించుటలో నాశ్చర్య మేమియును లేదు. ఈ శాకుంతలములోని లోకోత్తర మహాసాహిత్య లక్షణ మందరను సమాకర్షించుటకు కారణమైనది. అందువలననే దానికి కేవలము నాటకముల రూపమున వచ్చిన యనువాదములే తెలుగున ముప్పదికి మించినవి. కావ్యాద్యేతర రూపమున వచ్చిన యనువాదము లెన్నియో !

ఇట్లే ఎక్కువసారులు పరివర్తనము పొందిన మఱియొక నాటకము ఉత్తరరామ చరిత్రము. ఇదియు పదునెనిమిదిమందిచేత ననూదితమైనది. ఈ మహానాటకములు రెండును సంస్కృత సాహిత్యలక్ష్మికి చూడారత్నములు. ఈ మహాకావ్యముల పునః పునః పఠించి, భావించి, ఉక్కిరిబిక్కిరియైన తెలుగు రచయితలు వీనిని పరివర్తించిరి.

మహాకవుల ఊహామార్గములు బహువిచిత్రములైనవి. వందలకొలది సంవత్సరములనుండి సహృదయులు వానిని పఠించి, నిరంతర భావనము చేయుచున్నారు. ఒక్కొక్కనియందొక మహాకృతి ఒక మధురభావ వీచికయై కదలును. ఈ మహాకృతులను పూర్వులైన పండితులు వ్యాఖ్యానించిరి. అలంకార శాస్త్రములు వివరించినవి. ఆధునిక పండితులు నవార్థములు కల్పించుచున్నారు. కాళిదాసు, భవభూతి, మురారి మొదలైనవారు శబ్దబ్రహ్మసిద్ధి పొందినవారు. వారి యెడల "వాచమర్థోనుధావతి." అందువలననే వారి కృతుల కనేకములైన యనువాదములు వచ్చినవి. కేవలము కథ కొరకో, కొన్ని మధురములైన ఊహల కొరకో ఏ ఒక అనువాదమైనను సరిపోవును. కాని భావనాశీలురైన పాఠకుల కాశ్చర్యము కలిగించు శక్తిమంతములైన ఆ కృతులు ఒక్కొక భావుకున కొక్కొక్క రీతిగా గోచరించినవి. తనకు పూర్వము వచ్చిన యనువాదములం దారీతి వ్యాఖ్యానము చేయబడలేదు. ఆ శబ్దమునందలి సొగసు రాలేదు. ఆ వృత్తముయొక్క నడకలోని మాధుర్యము సంతరింపబడలేదు. ఆ మధురనాదముయొక్క స్ఫూర్తిలేదు. ఈ రీతిగా పొందిన యసంతృప్తిచేత మరియొక యనువాదమున కుద్యమించుట.

ఒకని యనువాదములోని లోపములు వానికి గోచరింపవు. వాని భావమార్గమున నవి సవ్యముగా వ్యాఖ్యాతము లగును కనుక. కాని వేరొకని భావమార్గము వేరు. అందువలన ఈ యనువాదములోని దోషములు వేరొకనికి గోచరించును. ఒక్కొక్కచో నవి దోషములు కావు. అచట నాయర్థములు వాని యూహ సాధించలేదు. ఇది గుణము కాకపోవచ్చును. ఒక అనువాదకుడు "మూలమున వాచ్యమగు దానిని ఇందు గమ్యమగు రీతిని, మూలమున గూఢగమ్యమగువాని గొంత వాచ్యాయ మానముగ" చేసినట్లు చెప్పినాడు. అతని మార్గమట్టిది. కొందరు ఆ మహాకవికి దేనిని వాచ్యముగ చెప్పవలయునో, దేనిని గూఢ

గమ్యముగా చేయవలయునో తెలియదా యన వచ్చును. కొందర కది వాచ్యము కానేకాదు. అచట మధురమైనయర్థమొకటి వారికి స్ఫురించును. అందువలన వారికీ యనువాద మార్గము నచ్చదు.

అనువాదము చేయుటకు మూలరచన యందలి ఆనంద సంధాయిలక్షణమే కారణమని చెప్ప వీలు లేదు. కొందరు మరికొన్ని కారణముల వలన తెలుగుచేసి యున్నారు. కొందరకు వస్తుగౌరవము (రామాదులందలి భక్తి). కొందరకు రచనా చాపల్యము. కొందరు భాషాసేవకొరకు, కొందరు ఎవరో కోరుటవలన; నాటక సమాజములవా రడుగుటవలన కొందరు—ఈ విధముగా అనేక కారణములను చెప్పుకొన్నారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు వడ్డాదివారి వేణీసంహారమును విమర్శింపగా, వారి మిత్రులు నీవే యనువాదము చేసి చూపుమనిరి. అందుకుగా వారు వేణీసంహారమును యథామూలముగా ననువదించిరి. ఇది స్పర్థామూలమైన యనువాదము.

ఏవి కారణములైనను అవి మనకంతగా ప్రధానములు కావు. మనకు కావలసినది అనువాదకుడుగా తన ధర్మము తాను నెరవేర్చెనాయన్నది. ఔచిత్యభంగము లేకుండ, స్వతంత్ర గ్రంథమా యన్నట్లు, అనువాదము పొందిన గ్రంథములు యిన్ని వందలలోను కొలది మాత్రమే. వీని యన్నింటిలోను శ్రేష్ఠతమములని చెప్పదగిన అనువాదములు చేసినవారు 1. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు 2. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు 3. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 4. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 5. శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గారలును. ఈ ఏవురును కాక మిగిలినవారు సమర్థులు కారని నా యభిప్రాయము కాదు. కాని వీరి యనువాదములు మిగిలిన వానికన్న శ్రేష్ఠములని చెప్పవలయును. వీనియందు అనువాద సామాన్యములైన దోషములు పూర్తిగా లేవని చెప్పలేము. కాని గుణబాహుళ్యముచేత నివి మిగిలిన వానినుండి ఎన్నుకొనబడినవి. ఈ ఐదుగురు కృతులలోను శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యనువాదములు సర్వశ్రేష్ఠములుగా నున్నవి.

వందలకొలది రూపకములుగల సంస్కృతభాష నుండి మన భాషలో ననువదింపబడినవి కొలదియే. వీనిలో ప్రసిద్ధములైన రూపకములన్నియు చేరి యున్నవి. కాని ప్రచారములో లేని చాల ఉత్తమ రూపకములు అనువాదము పొందనేలేదు. అనువదించినవానినే మరల మరల ననువదించు నుద్యమముకన్న అనువాదము పొందని క్రొత్తరూపకముల ననువదించుట కర్తవ్యము. అశ్వఘోషుని శారిపుత్ర ప్రకరణము కూడ తెలుగులో వచ్చినట్లులేదు. బౌద్ధజైనములైన మతగ్రంథములతోపాటు వారి సుందరములైన రూపకములుకూడ ప్రచారము నుండి తొలగినవి. వాని యనువాదముకూడ జరుగవలసి యున్నది.*

ఈ అనువదింపబడిన నాటకములలో చాలవరకు ప్రదర్శితములు కాలేదు. కొన్ని మాత్రమే ప్రదర్శితమైనవి. వీరేశలింగముపంతులుగారు ప్రదర్శనమునకే నాటకము ననువదించిరి. వేదము వేంకటరాయశాస్త్రిగారి ఉత్తరరామచరిత్రమునుకూడ వారి శిష్యులు ప్రదర్శించిరి. మొత్తము మీద మొదటి దశకు చెందిన రచయితల నాటకములు ప్రదర్శితములైనవి. కాని తరువాత స్వతంత్ర నాటకములువచ్చి వానిని వెనుకకు నెట్టినవి. వీనిని

*అనువాదము పొందని కొన్ని సంస్కృతరూపకములు. 1. రామచంద్రుని గోపాల కేళీచంద్రిక (1917 లో ఫ్రెంచి లిపిలో ఫ్రాన్సులో ప్రకటితము) 2. ఘనశ్యాముని డమరుకము. 3. శారిపుత్ర ప్రకరణము. 4. మహానాటకము 5. మైథిలీ కళ్యాణము. 6. ఉదారరాఘవము. 7. జానకీపరిణయము. 8. విశ్వనాథ మహాకవి (అగస్త్యుని మేనల్లుడు) రచించిన సౌగంధికాపహరణము.

కూడ చిన్న చిన్న రూపకములు వచ్చి ప్రదర్శింప కుండ చేసినవి.

ఇవి ప్రదర్శితములు కాకపోవుటకు మరికొన్ని కారణములున్నవి. ఈ నాటకములు ఆనాటి రంగస్థలానుకూలముగ లేకపోయినవి. వానిని నిర్దుష్టముగా ప్రదర్శించుటకు చాల ప్రయాస పడ వలసియుండెను. సామాన్య నాటకములవలె వీనిని ఇష్టమువచ్చినట్లు ప్రదర్శించుటకు వీలులేదు. ఈ నాటకములకు పండితులెక్కువగా చూచుటకు వచ్చుచుండువారు. అందువలన వారిముందు అవక తవకగా ప్రదర్శించి నాటక సమాజముయొక్క గౌరవము మంటగలుపునుద్దేశ్యముగాని, ధైర్యము గాని వారికి లేకుండెను. గయోపాఖ్యానము, ఉద్యోగ విజయములు, చింతామణివంటి నాటక ములవలె వీనికి జనాదరణముకూడ లభింపలేదు.

తరువాతి కాలమునకూడ పైప్రఖ్యాత నాటక ములేకాని ఆనాటి సాహితీ సమితికవుల నాటక ములుకూడ ఎక్కువగా ప్రదర్శితములు కాలేదు. సాంఘిక నాటకములు ప్రదర్శించుకాలములో వీనిని ప్రదర్శించువారు లేకపోయిరి. వానిలోని పద్యములు, గ్రాంథికభాష, వస్తువుకన్నను ఆధునిక సమాజములవారికి వానిని దూరముచేసెను.

ఈజరిగిన వందలకొలది యనువాదములలో నే యనువాద మేరీతిగానున్నదో మనము నిర్ణయింప లేము. అనువాదము చేయువాడు యన్మహాకవి రచనమును తా ననువదింపబూనినాడో వాని శిల్ప మార్గమును వైదుష్యమును తెలియవలయును. వాని ఊహామార్గములు పట్టుకోవలయును. తా నొక మధురమైన ఊహను చేయవచ్చును. కాని ఆ ఊహ నీ వచట ప్రకటించినచో ప్రధానమైన ఉద్దేశ్యమునకే భంగము రావచ్చును.

ఒక్కొక్కకవి కొక్కొక శాస్త్రమందభినివేశ ముండును. మురారి తర్కవ్యాకరణములందు, విశాఖదత్తు డర్థశాస్త్రమునందు భాసుడు న్యాయ శాస్త్రమునందు లోతులెరిగిన వారు. కాళిదాసు సౌందర్య సంబంధములైన బహుసిద్ధాంతముల వ్యాఖ్యానించుచు బోవును. భవభూతి రససంబంధ మైన విచారణచేయును. జీవుని హృదయధర్మ మును వ్యాఖ్యానము చేయును. ఒకని పాండిత్యము లోతు మనకు తెలియనే తెలియదు. వీరందరకు భార తీయ వేదాంతములోని రహస్యములు బాగుగా తెలియును. ఒకనిశ్లోకములు పాటలవలె నుండును. మరియొకని రచన మంత్రములవలె వేదబుక్కుల వలె నుండును. వారు శబ్దబ్రహ్మాఖ్య పరిమళము నాఘ్రాణించినవారు.

ఆ కవియొక్క రచనామార్గము నెరుగక ఆ రచనము ననువదించుట యపచారము.

శాకుంతలములోని ఒక శ్లోకమునకు చేయబడిన కొన్ని యనువాదములివి.

రమ్యాణివీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకోభవతి యత్సుఖితోపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని (5అం-2శ్లో)

మున్నెఱుగకయు, మదినంటు పూర్వజన్మ
భవ్యసఖ్యముల్ స్మరణకువచ్చుఁగాన
జనుఁడు సుఖితుడయ్యు, సురూపచయముఁగనియు
సుస్వరంబులు వినియు నుత్సుకతగాంచు.

(కందుకూరివారు)

రమణీయంబగువానిఁ జూచి
మధురాలాపంబు లాలించి సౌ
ఖ్యమునుం బొందుచునున్న జంతువు
నితాంతౌత్సుక్యముం గాంచుఁ గా
న, మనంబందు నబోధపూర్వకముగ
నెన్నంబూనెడుం జుమ్మవ
శ్యముఁ దానప్పుడు భావనిశ్చలము
లౌ జన్మాంతర స్నేహముల్.

(రాయదుర్గము నరసయ్యగారు)

చక్కని వస్తువుల్గనినఁ
జారుతరధ్వను లాలకించుచో

నొక్కొకసారి ప్రాణికడు
నుత్సుకుఁడౌ సుఖవంతుఁడయ్యు, నా
నిక్కువమింత భావమున
నిల్చిన యే జననంబులోని యే
మక్కువనో యెఱుంగక యె
మానసమందుఁ దలంచుచుండుబో.

(ముళ్లపూడి నారాయణశాస్త్రి)

చెవికింపైన రవంబు కంటికిఁ గడున్
జెల్వంబునుంగూర్చు వ
స్తువులుండోపఁ నొకొక్క వేళ
నిటులెంతో సౌఖ్యముంజెందు జం
తువులున్ వెక్కసపాటు గూరుట
రయన్ లోగాటమై నిల్చి యె
క్కువడిన్ రేఁగి యెఱుంగిరాకెసగు
ప్రాగ్జన్మంపు మైత్రిం జుమీ.

(కాకర్ల కొండలరావు.)

సురుచిర రూపముల్ గనియు
సొంపగు శబ్దము లాలకించియున్
వరసుఖయైన మర్త్యుడు
నవారణఁ దాఁ దమకించునెల్ల సు
స్థిరముగ భావమం దధి
వసించు భవాంతర సౌహృదంబులఁ
గరము నబోధపూర్వక
ముగా స్మరియించుటచేత నే సుమీ!

(దుర్భా సుబ్రహ్మణ్య శర్మ)

"......సర్వవిధముల సుఖపడువారు సైతము వ్యాకులహృదయులగుచుండుటకు కారణము, రమణీయమగు వస్తువును దర్శించినపుడు, మనోహరమగు గీతమాలకించినపుడు, ఏదియో జన్మాంతరము నందలి స్థిరస్నేహము స్మృతిపథమునకు వచ్చుటయే కానోపు......"

(చిలుకుల శ్రీరాములు)

ఇందు మొదటి యైదు పద్యములలో వేయబడిన యనువాదములు. చివరి రచయిత మరికొంత స్వేచ్ఛ వహించి యిచ్చట గద్యమునే వాడినారు. వీరేశలింగముగారి రచన యథామూలముగ భావానుసారంగా సాగినది. వారు కాళిదాసు వాడిన శబ్దములకూడ వాడదలచినారు. మొత్తముమీద పద్యములన్నియు కాళిదాసును దాటిపోలేదు. మూలమునందు శ్లోకములోని నాదసౌందర్యము అనువాదములలో లేదు. కాళిదాసు భావమునకు స్పష్టత వచ్చినది, శ్రీ ముళ్ళపూడి నారాయణ శాస్త్రిగారి యనువాదమునందు. ఒక జీవుడు సుఖానుభూతి పొందుచున్నను, రమ్యమైన స్వరూపమును వీక్షించినపుడు, మధురమైన స్వరమును విన్నపుడు మనస్సున నుద్వేగపడును. ఇది మనోలక్షణము. ఇది రససిద్ధాంతమునకు కూడ మూలభూతమైనది. వాసనా స్వరూపమును ఇది నిశ్చయించును. నారాయణశాస్త్రిగారి యనువాదములోని "యే జననంబులోని యే మక్కువనో ఎఱుంగక యె" అన్న వివరణ చాల చక్కగా చేయబడినది. ప్రాగ్జన్మ మొదలైన శబ్దములకన్న యే జననంబులోని అన్న ప్రయోగము చక్కగా సరిపోయినట్లున్నది. కాళిదాసు వాడిన శబ్దములు వాడియు సద్యస్స్ఫుగా అర్థస్ఫూర్తికల రచన శ్రీ రాయసం దుర్గయ్యగారిది. ఇట్లే శాకుంతలము యొక్క సర్వానువాదములు పరిశీలింపవలయును.

ఉత్తరరామ చరిత్రలో—

తమసా-జానామివత్సే!

తటస్థం నైరాశ్యాదపిచ కలుషం విప్రియవశా
ద్వియోగేదీర్ఘేఽస్మిన్ ఝటితిఘటనాత్ స్తంభితమివ
ప్రసన్నం సౌజన్యా ద్దయిత కరుణై ర్గాఢకరుణం
ద్రవీభూతం ప్రేమ్ణా తవ హృదయ మస్మిన్ క్షణఇవ.

రామః—దేవి!

ప్రసాద ఇవ మూర్త స్తే స్పర్శస్నేహార్ద్రశీతలః
అద్యాప్యానందయతి మాం త్వంపునః క్వాసినందిని.

అన్నచోట శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారిట్లనువదించిరి.

తమస : ఎఱుంగుదును, బిడ్డా! ఎఱుంగుదును.

ఆసడిందుటచే నుదాసీనముంబలెను.
విప్రియంబునజేసి విషమమువలె
చిరతరంబైన ఈవిరహోన డబ్బాటు
ఘటనచేతను బ్రాపు గన్నదివలె
సౌజన్యమున సుప్రసన్నంబుబలె బ్రియు
కరుణంబులకు గాఢకరుణముబలె
రాగంబుచేత కరంగినయదిబలె
నీ మనంబైన దీ నిముసమందు.

రాము: దేవీ!
మూర్తిగొన్న ప్రసాదముంబోలె నీదు
చేతితాకుడు స్నేహార్ద్రశీతలంబు
నాకు నిడుచున్న దిపుడు నానందభరము
నందినీ గానబడవు నీవెందు నకట!

ఇచ్చట తమస సీతా హృదయమును గూర్చి చెప్పుచున్నది. రాముడు సీతాదేవి స్పర్శను గూర్చి యూహించుచున్నాడు అనువాదమునం దీ రెండు శ్లోకములును ఒకేసీసమునందు కూర్చబడినవి. ఇది ఒక అనుస్యూతమైన భావమునకు కలుపవలసిన పద్ధతిగాని వేర్వేరుపాత్రలు వేర్వేరువిషయములపై మాట్లాడునపుడు చేయదగిన విషయము కాదు. మొదటి శ్లోకములోని యందము సీసముగాక వృత్తమువాడినచో వచ్చెడిది. రెండవశ్లోకములోని ప్రసాదశబ్దము తెనుగులోనికి తెచ్చుటలో సొగసు లేదు. ఆశబ్దమునకు తెలుగులో వేరర్థములు స్ఫురించును. ఇచ్చట ప్రసన్నత మొదలైన శబ్దములు వాడవలయును. స్పర్శశబ్దమునకు చేతితాకు డనుట యనువాదము కాదు. అది కేవలము దాని యొక్క సౌందర్యమును వికృతము చేయుటయే. అద్యాప్యానందయతి అన్నదానిలో సౌందర్యము "నాకు నిడుచున్న దిపుడు" అనుటలో లేదు. "త్వం పునః క్వాసి నందిని" యన్నదానిని "నందినీ కాన బడవు నీవెందు నకట" యని యనువదింపరాదు. "నందినీ నీవు మరల ఎక్కడనున్నావు" అని ప్రశ్నార్థకముగానే వెలయవలయును. ఈ మరల యన్నది పూర్వవియోగము స్ఫురింపజేయు శబ్దము.

మహాకవుల అతిలోక రమణీయములైన రచనలు తెలుగుభాషలో నిట్లు చెడిపోయినవి.

సీత తాను రామునకు కనుపించితినేమో యన్న అనుమానము పొందగా తమస నీవు వనదేవతలకు కూడ భాగీరథీప్రభావమున కానరావని చెప్పును. అప్పుడు సీత "హుం. అస్త్యేతత్" అనును. దానిని శ్రీ వేదంవారు "అవును. అది కలదు" అని యనువదించిరి. ఇచ్చట వారు సంస్కృతపదముల కర్థము వ్రాసిరి. కాని అనువాదము కాదు. ఈ చోట తెలుగు వ్రాసినచో "ఔను. అదియు నిజమే" అని వ్రాయవలయును.

ఒక పద్యమునో, కొన్ని వాక్యములనో తుల నాత్మకముగా పరిశీలించి వానిలో శ్రేష్ఠములైన యనువాదములని చెప్పవీలులేదు. పరమేశ్వరాను గ్రహమువలన కొన్ని తక్కువ రకపు అనువాదములలో ఆచోట్లు బాగుగా వ్రాయబడియుండ వచ్చును. కొన్నిమంచి యనువాద గ్రంథములం దా చోట్లు చెడిపోయి యుండవచ్చును. గ్రంథముల శ్రేష్ఠతాశ్రేష్ఠతల నిర్ణయించునపుడు ప్రధానముగ సర్వమును పరిశీలించి నిర్ణయింప వలయును.

ముద్రారాక్షసములో—

సత్త్వభంగభయా ద్రాజ్ఞాం కథయ న్త్యన్యథాపురః
అన్యథా వివృతార్థేషు స్వైరాలాపేషు మంత్రిణః"

అన్న శ్లోకమునకు

మంత్రిపుంగవులెందు భూమండలాధి
పతులముందర నొక రీతిఁ బలుకుచుంద్రు
అర్థ మది తెల్లముగ మాటలాడునపుడు
మఱొక విధముగ జరుగు సంభాషణంబు.

అని తిరుపతి వేంకటకవు లనువదించిరి. ఇది పూర్తిగామూలమును పాటించని యనువాదము. సత్త్వభంగభయాత్ అన్నమాట కిచట అనువాదము లేదు. మంత్రిణః అన్నచో మంత్రిపుంగవులు. రాజ్ఞ శబ్దమునకు భూమండలాధిపతులన్న యనువాదము చేయుటలో సాధించిన ప్రయోజనము లేదు.

మూలమందున్న అర్థసారళ్య మనువాదమందు లేదు. ఇది సమర్థమైన అనువాదము కాదు.

వేణీసంహారమున—

కురు ఘనోరుపదాని శనైశ్శనై
రయి విముంచ గతిం పరివేపినీం
పతసి బాహులతోపరి బంధనం
మమ నిపీడయ గాఢ మురస్థలమ్.

అన్నదానిని

అడుగుల మెలమెల్లగనిడు
వడకుచు నడువంగబోకు పడెదవుసుమ్మీ!
పడతీ! భుజలతికలు నా
మెడకును బెనవేయు మురము మెఱమఁగఁ
జన్నుల్. (వడ్డాదివారు)

మెలమెల్లగ నడుగుల నిడు,
మిల నడకం దొట్రువడకు మిట్లు ఘనోరూ!
బలముగ నన్నున్ వక్ష
స్థలమున బెనఁగొనుము నీ భుజాలతికలతో.
(శ్రీపాదవారు)

మెల్లమెల్లగ నడుగుల నుల్లసిల్లఁ
జేసి నడువుము వణఁకకు స్నిగ్ధబాహు
లతికఁ బెనవేయుమీ నన్ను సతి! యురంబు
గాఢకుచఘర్షణంబున గాయపఱుప.
(బులుసువారు)

ఈ మూడు అనువాదములలోను మొదటి రెండు మూలానుసారములై యున్నవి. నడకలోని యందముకూడ వానియందు వచ్చినది. ఈ రెంటిలోను శ్రీపాదవారి యనువాదము మూలమునకు మరియు దగ్గరగా నున్నది. మిగిలిన రెంటను రాని ఘనోరుశబ్దము దీనిలో వచ్చినది. బులుసువారి యనువాదములో మూలాతిక్రమమున్నది. నాల్గవ పాద మట్లు లేకున్నచో మరియు బాగుండును. సంస్కృతచ్ఛందస్సులోని రమ్యత ఎట్లును రాలేదు. "మెలమెల్లగ నడుగుల నుల్లసిల్ల" వంటివి పద్యరచనా శైథిల్యమును చూపుచున్నవి. ఘనోరు అన్న సంబోధనకు బదులుగా సతి యన్న మాట వాడుటలో అందము లేదు.

ఇందే భీముడు దుశ్శాసనాది సంహారముచేసి రక్తసిక్తగాత్రుడై వచ్చినపుడు ద్రౌపదిని సమీపించి "దేవి! పాంచాల రాజతనయే! దిష్ట్యావర్ధసే రిపుకులక్షయేణ అలమల మేవం విధ మాలోక్య త్రాసేన" అన్నచో "రాజపుత్రీ! నన్ను చూచి భయపడకుము పలనన"యని బులుసువారి యనువాదము. అప్పుడే ప్రతిజ్ఞాపాలనము చేసి వచ్చిన భీముని విజయగర్వము ద్రౌపదియందలి ప్రేమ సంస్కృతవాక్యములలో ధ్వనించును. ఆమె దేవి. పాంచాల రాజతనయ కూడను. ఆ మహారాజ్ఞి పొందిన అవమానమునకు తా నిన్నాళ్ళకు ప్రతీకారము చేయగలిగెను. అట్టిచో ఉద్వేగకరములైన వాక్యముల విసర్జించి కేవలము చప్పగా "రాజపుత్రీ! నన్ను జూచి భయపడకుము పలనన" ఇత్యాదిగా అనువదించుట న్యాయము కాదు. అలమలమని రెట్టించుటలో భయపడుచున్న ద్రౌపది స్ఫురించును. ఆమెకు తన పరాక్రమము వెల్లడించుటలోని తొందర గోచరించును. ఈ యర్థము లేవియు నిందు రాలేదు. (సశేషము)

## వచ్చే సంచికలో

మాదిరాజు రంగారావు

సోమసుందర్

కలువకొలను సదానంద

నాగళ్ళ గురుప్రసాదరావు

అనుముల కృష్ణమూర్తి

సుప్రసన్న

విశ్వనాథ సత్యనారాయణ

516, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాది గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : 4616
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.